# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938 – 1972)
శుక్రవారం : 22–11–'74
ఆనందనామ సం. కార్తీకమాస శు. అష్టమి
*సంపుటము : 68 సంచిక : 10*
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
★
సంవత్సర చందా – రు. 31–20 పై.
ఆరుమాసాల చందా – రు. 15–60 పై.
విడిప్రతి వెల 55 పైసలు
*ఆంధ్రపత్రిక కార్యాలయము*
*గాంధీనగరం, విజయవాడ-3.*


## విషయానుక్రమణిక



*పై వారమే !*
*బహుమతి పొందిన కథలు*
*'దీపావళి' — 'పట్టుచీర'*

## * మనలో మాట *

పాఠకులందరికీ దీపావళి శుభాకాంక్షలు !

ఈసారి దీపావళి కథలపోటీకి చాలా కథలే వచ్చాయి. వచ్చిన వాటిలో మంచి వని తోచిన నాలుగింటిని ప్రచురిస్తున్నాము.

ఈ నాలుగింటిలో యే కథకి యే స్థానం రావాలో పాఠకులే నిర్ణయించాలి! దీనికోసం ఒక బాలట్ పెడుతున్నాము.

బాలట్ మరింత ఆసక్తికరంగా ఉండేందుకు పాఠకులకోసం ఒక 'వ్యాస రచన పోటీ' కూడా నిర్వహిస్తున్నాము.

ఇంతకు ముందే ప్రకటించినట్లు "పోటీ కథల" రచయితల పేర్లు వాటితో పాటే ప్రచురించటంలేదు. బాలట్ ఫలితాలు వెలువడినప్పుడు రచయితల పరిచయం చేస్తాము!

పయిన చెప్పిన నాలుగు కథలు కాక మరి కొన్నిటిని ప్రచురణకి తీసుకున్నాము. ఆ రచయితలకు ఎప్పటిలాగే "స్వీకారం ఉత్తరాలు" పంపుతాము.

పోటీలో పాల్గొన్న వారందరికీ మా కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాము.

ఆంధ్ర సచిత్ర వారపత్రిక పాఠకులందరూ బాలట్‌లో పాల్గొని దానిని జయప్రదం చేస్తారని ఆశిస్తున్నాము.

వ్యాసరచన పోటీ వివరాలు పై వారం యిస్తాము. బాలట్ పత్రం కూడా పై వారమే వేస్తాము.

* * *

ఈ వారం ప్రారంభమైన సీరియల్ "ఇద్దరమ్మాయిల కథ" రచయిత్రి శ్రీమతి ఎస్. హేమలతగారు పుట్టింది విద్యాభ్యాసం చేసింది అంతా మద్రాసు నగరంలోనే. ఎం. ఏ. పట్టభద్రురాలు. కథలు, నాటికలు అవీ రాస్తూండటం వారి హాబీ. ఇదే మొదటి సీరియల్ కథా రచన. ఆమె యిప్పుడు భర్త వుద్యోగరీత్యా నాగార్జున సాగర్‌లో వుంటున్నారు.



## ఉత్తరాలు

### కథలు

1—11—74 దసరా సంచికలోని ఉత్తరాల శీర్షికలో శ్రీ సత్తిమోహన్‌రెడ్డిగారు (తాడేపల్లి గూడెం) వ్రాసిన ఉత్తరం చదివాను.

'కథ మళ్లీ మొదటికి' కథలో వ్రాసినట్లు తాడేపల్లిగూడెంకు ఇంకా "బాబీ" సినిమా రాలేదనీ, ఆ వూళ్లో రిజర్వేషన్ పద్ధతి లేదని ఆయనవ్రాశారు. కాని 'కథ' అనేది కేవలం కల్పితం అని, కథకు 'కల్పన' ఆయువని మనం మర్చిపోకూడదు.

కథలో పాత్రలతోపాటు సంఘటనలు పరిస్థితులూ కూడా కల్పించవలసి ఉంటుంది. కొన్ని సందర్భాలలో కొంత వరకు యదార్ధ పరిస్థితులను వాడుకోవడానికి అవకాశం ఉంటుంది. మిగతా సందర్భాలలో కొన్ని యదార్ధ పరిస్థితులకు కొంత కల్పన చేర్చవలసి ఉంటుంది.

జి. కస్తూరి (పిఠాపురం)

### కాసు-రాజాజీ

1—11—74 సంచికలో హైదరాబాద్ నోట్ బుక్‌లో శ్రీ కాసుబ్రహ్మానందరెడ్డి చిత్రము క్రింద దక్షిణాత్యులలో కేంద్ర హోం మంత్రి పదవిని అలంకరించిన మొదటి వారని వ్రాసినారు. కాని ఇది నిజముకాదు. ఆ పదవిని అలంకరించిన మొదటి దక్షిణాత్యుడు శ్రీమాన్ రాజగోపాలచారి గారు. ఆయన కొన్నాళ్ళు నెహ్రూగారి కేబినెట్‌లో దేశీయాంగ మంత్రిగా పనిచేశారు.

డా. వి. శ్రీనివాస్ (ఇమ్మిడివరప్పాడు)

### బియ్యం — విదేశీ సారాయి

ఆంధ్రప్రదేశ్‌లో బియ్యంధరలు మండిపోతుంటే మన ముఖ్యమంత్రిగారు మద్రాసు వారికి పదివేల టన్నుల కర్నాటకకి అయిదువేల టన్నులు, ఒరిస్సాకి మరో అయిదువేల టన్నులు, కేరళకి మరో అయిదువేల టన్నులు ఇచ్చారు. ఇతర రాష్ట్రాలకు సరఫరా చేసినందుకు బాధలేదు, కానీ తమిళనాడు నుంచి బియ్యానికి బదులు విదేశీ మద్యం తెచ్చారన్న వార్త షాక్‌లా తగిలింది. బహుశా విదేశీ సారాత్రాగి "ఆంధ్ర దేశమూ అన్నపూర్ణయని అఖిల జగాలకు చాటండి" అని పాడుకోవాలేమో !

(13 వ పేజీ చూడండి)

తప్పక చూడండి!

గంగాధర్

రవిచిత్ర ఫిలిమ్స్

# నిప్పులాంటి మనిషి

ఈస్ట్‌మన్ కలర్



నిర్మాత: వై.వి.రావ్

దర్శకత్వం: యస్.డి.లాల్

పూర్ణా రిలీజ్

NAVRANG




"కాంతం.... నా జపమాల కనిపించటంలేదు. ఎక్కడ వుందో కొంచెం చూసి పెట్టు" బావిదగ్గర స్నానం ముగించుకుని తడి బట్టను జామి చెట్టుకు కట్టిన తాడు మీద ఆరేసి పట్టుబట్ట కట్టుకుని పూజా మందిరం ముందు కూర్చున్న శివమూర్తిగారు గట్టిగా పిల్చారు.

"అయ్యో రామ... మీ జపమాల కూడా నేనే వెతికి పెట్టాలండీ" అంటూ నీళ్లు కారుతున్న తడి బట్టతో వచ్చి దేవుని పటం వెనుక నున్న జపమాలను శివమూర్తిగారి చేతిలోపెట్టి వంటగదిలోకి వెళ్లింది కాంతం.

అన్ని స్తోత్రాలు కానిచ్చి గంట తర్వాత పూజ గదినించి బయట పడ్డారు రిటైర్డు హెడ్మాష్టరు శివమూర్తిగారు.

పట్టుబట్ట విప్పి దోవతి కట్టుకుని, లాల్చీ వేసుకుని మనీపర్సు పక్కజేబులో దురుచుకుంటూ కాంతాన్ని పిలిచారు.

"అబ్బ... మళ్లీ ఏం కనిపించలేదండీ" అంటూ విసుగుతో పమిటకొంగును నడుము చుట్టూ తిప్పుకుంటూ వచ్చింది కాంతం.

"కోప్పడకు కాంతం... ఎటు తిరిగీ వంట పూర్తయ్యేసరికి ఇంకా రెండు గంటలు పడుతుందికదా... ఈలోపున అలా బజారువరకూ వెళ్లివస్తాను. బజారునించి ఏమైనా తీసుకు రావాలంటే చెప్పు."

"ఏం అవసరం లేవులెండి" అని ఒక్క క్షణం ఆగి "అన్నట్టు మరచిపోయాను ఈ రోజు ద్వాదశికదూ, ఒక పావలా తమల పాకులు—ఒక అరడజను అరటిపండ్లు తీసుకు రండి" చెప్పింది కాంతం.

"పూలు అవసరంలేదా? కోడలు పెట్టుకుంటుందేమో."

"ఎందుకు? పెరట్లో సన్నజాజి పందిరికి చాలా పూలున్నాయి. ఇంకేం అవసరం లేదు. మీరు త్వరగారండి. మళ్లీ మీకోసం

కనిపెట్టుకు కూర్చోవాల్సొస్తుంది." అన్నది కాంతం వంటగదిలోకి వెడుతూ.

"అలా గేలే కాంతం ... మన పెళ్లయిన ముప్ఫైయేళ్లలో ఏ నాడైనా నీ మాట దాటానా" అని నవ్వుకుంటూ వీధిలోకి నడిచారు శివమూర్తిగారు

అలా వీధిలోకి వెళ్లిన శివమూర్తిగారికి జడ్జీగారి ఇంటి ప్రహరీ గోడమీద కూర్చుని పెద్దగా అరుస్తున్న ఒక కాకి కనిపించింది.

"కా...కా..." అంటూ శివమూర్తిగారి వైపు చూస్తూ పెద్దగా అరుస్తోంది.

అలా అరుస్తున్న కాకివైపు రెండు నిముషాలు చూసి నాలుగడుగులు ముందుకు వేశారు ..."కా ...కా ..." అరుచుకుంటూ శివమూర్తిగారి తలమీదగాపోయి హెడ్‌క్లర్క్ వెంకటాచలంగారి ఇంటిమీద వాలి అరుస్తోంది కాకి.

'ఈ కాకి తన చుట్టూ ఇలా తిరుగుతుందేమిటి!' తనలో తనే అనుకుని మరలా ముందుకు నడక సాగించారు.

అరుచుకుంటూ శివమూర్తిగారి కంటే ముందుగా పోతూ ఆ ఇంటిమీదా ఈ ఇంటి మీదా వాలి అరుస్తోంది కాకి.

ఈసారి శివమూర్తిగారికి ఆశ్చర్యం వేసింది. అది తన చుట్టూ ఎందుకిలా తిరుగుతుంది? ఇదివరలో దానికి గుప్పెడు అన్నం మెతుకులు వేసిన గుర్తు కూడా లేదు. మరి తన చుట్టూ అరుస్తూ ఎందుకు తిరుగుతోంది ఈ కాకి. అది శివమూర్తిగారి ఊహకు అందని విషయమైంది.

శివమూర్తిగారితో బజారువరకూ వచ్చి ఎటువైపుకో కనిపించకుండా ఎగిరిపోయింది కాకి.

తమలపాకులు — అరటిపండ్లు — తీసికుని చుట్టూ చూశారు శివమూర్తిగారు కాకి కోసం. కాని అది కనిపించలేదు.

* * *

భోజనంచేసి బావిదగ్గర చెయి కడుక్కుంటున్న శివమూర్తిగారికి కాకి అరుపు వినిపించి తలయెత్తి చూశారు.

బావి పక్కగా గోడమూల వున్న జామిచెట్టు కొమ్మమీద ఒకవైపు వొరగబడి కూర్చుంది కాకి. ఎడమచేత్తో పట్టుబట్టను ఎత్తిపట్టుకుని కుడిచేత్తో వెండి చెంబును పట్టుకుని చెట్టుక్రిందికివచ్చి కాకిని పరీక్షగా చూశారు శివమూర్తిగారు. దానికి కుడికాలు లేదు. సగంవరకు మెలిక తిరిగి

దీపావళి కథల పోటీలో
రు. 750 లు
బహుమతి పొందిన కథ

పోయివుంది. 'పాపం! కుంటికాకి' అనుకున్నారాయన మనసులో.

"ఒరేయ్ వాసూ" చెంబును గుమ్మందగ్గర వుంచుతూ పిలిచారు శివమూర్తిగారు.

"ఏమిటి తాతయ్యా" నడవాలోనించి పరిగెత్తుకుంటూ వచ్చాడు అయిదేండ్లవాసు.

"మీ నాన్నను వడక్కుర్చీతెచ్చి జామిచెట్టు క్రింద వెయ్యమను."

వాసు మళ్లీ పరిగెత్తుకుంటూ వెళ్లిపోయాడు. వాసు తండ్రి కుర్చీ తెచ్చాడు. "పరమేశ్వరా" అంటూ కుర్చీలో వాలిపోయి పైకి చూశారు శివమూర్తిగారు. కాకి శివమూర్తిగారి వైపే చూస్తుంది. దానిని చూస్తుంటే ఆయనకు ఎందుకో తగని జాలి వేసింది. మనసు నిలువక "వర్ధనీ...వర్ధనీ" అంటూ పిలిచారు.

మామగారి పిలుపు వినిపించి వంటింట్లో ఎంగిళ్లు ఎత్తుతున్న వర్ధని "ఏమిటిమామయ్యగారూ" అంటూ వచ్చింది.

"ప్లేటులో గుప్పెడు మెతుకులను వేసుకొచ్చి ఆ గోడ మీద పెట్టు"

శివమూర్తిగారి మనస్తత్వం కోడలు వర్ధనికి బాగా తెలుసు. అందుకే ఎందుకని ఎదురుప్రశ్న వెయ్యకుండా వంటింట్లోకి వెళ్లి చిన్నపళ్లెంలో అన్నం మెతుకులను వేసుకొచ్చి, గోడమీదపెట్టి వెళ్లిపోయింది.

జామిచెట్టు మీదనించి ఎగురుకుంటూవచ్చి గోడ మీద పళ్లెంలోని మెతుకులను గబగబా తినసాగింది కాకి.

ఆ దృశ్యం చూస్తుంటే శివమూర్తిగారు తానేదో ఘన కార్యం చేసినట్లు ఫీలయ్యారు. మనసంతా సంతోషంతో నిండిపోయింది.

మెతుకులు తిన్న తర్వాత బావిదగ్గర గుంటలో నిల్చిన నీటిని త్రాగి మళ్లీ జామిచెట్టు మీదకు వచ్చింది కాకి.

కుర్చీలో వెనక్కి వాలి కాకినే దీక్షగా చూస్తున్న శివమూర్తిగారి మనసులో ఎన్నో ఆలోచనలు దొర్లిపోతున్నాయి.



'చనిపోయిన తర్వాత పితృ దేవతలు కాకి రూపం ధరిస్తారంటారు. అది నిజమేనేమో! అందుకే తద్దినం పెట్టినరోజు కాకికి పిండం వేస్తారు. పితృదేవతలు ఆ రూపంలోవచ్చి తిని పోతారంటారు. ఈ ఆలోచన రాగానే ఆయన మనసులో అయన తండ్రి రంగనాధంగారు మెదిలారు. రంగనాధంగారికి శివమూర్తిగారంటే ఎంతో ఇష్టం. శివమూర్తిగారు ఒక్కరే సంతానం. అందుకే గారాబంగా పెంచారు. ఒక వేళ తనతండ్రే కాకిరూపంలో వచ్చాడేమో,' అనిపించింది శివమూర్తిగారికి.

ఈ ఊహ ఆయన మదిలో మెదిలిన తర్వాత కుంటికాకి మీద శివమూర్తిగారికి పూజ్యభావం కలిగింది. కాకిని చూస్తుంటే తన తండ్రే ఎదురుగా వున్నట్టు తృప్తి చెందారు.

ఇలా కాకిని గురించి ఆలోచిస్తూనే ఆయన ఎప్పటికో నిద్రలోకి జారిపోయారు.

ఎంతవరకు నిద్రపోయారో! ఏమో! "తాతయ్యా... తాతయ్యా" వాసు పిలుపుతో కళ్లు తెరిచి చూశారు శివమూర్తిగారు.

ఎదురుగా వాసు ఉప్మాప్లేటుతో నిలుచుని వున్నాడు.

చిన్నగా నవ్వి వాసు చేతిలోని ఉప్మాప్లేటును అందుకుని జామిచెట్టు పైకి చూశారు. కాకి కనిపించలేదు 'ఎక్కడికి ఎగిరిపోయిందో' అనుకుని ఉప్మాతిని, కాఫీ త్రాగి బావిదగ్గర ముఖం కడుక్కుని ఉతికిన ధోవతి కట్టుకుని, లాల్చీ వేసుకుని, ఉత్తరీయాన్ని బుజంమీద వేసుకుంటూ పార్కువరకూ వెళ్లివద్దామని బయల్దేరారు శివమూర్తిగారు ఆయనకు ప్రతిరోజూ పార్కుకు వెళ్లి తన స్నేహితులతో ముచ్చటలాడి చీకటిపడిన తర్వాత గూటికి చేరటం అలవాటు.

వీధిలోకివచ్చి జడ్జీగారి ఇంటివైపు చూశారు.

కాకి కనిపించలేదు.

ప్లీడరుగారి మామిడి చెట్టు మీద నించి కాకి అరుపు వినిపించింది. తలను అటుతేసి తిప్పారు. అది కుంటికాకి కాదు. మరో కాకి గొంతు బొంగురు పోయినట్లుగా అరుస్తోంది

కొంతదూరం వెళ్లాక కుంటికాకి ఎక్కడి నించో ఎగురుకుంటూ వచ్చింది. శివమూర్తిగారి గుబురుగా పెరిగిన మీసాలమధ్య చిరుమందహాసం వెల్లివిరిసింది. ఆయన కనులలో



కాంతంఖలు నువ్వు వస్తావని నాకు తెలుసు' అన్నట్లున్నాయి ఆయన చూపులు

ఆయనతో పార్కువరకూ వచ్చి మళ్ళీ ఎటో ఎగిరిపోయింది కాకి

చీకటి పడిందాకా పార్కులో కూర్చుని ఇంటికి బయల్దేరారు శివమూర్తిగారు

ఆయన ఇంటికి వచ్చేసరికి వాసు వరండాలో లైటుక్రింద కూర్చుని కాకిపారం చదువుతున్నాడు

లాల్చీవిప్పి వంకీకి తగిలించి, ఉత్తరీయాన్ని దండెంమీద వేసి కుర్చీలో వాలిపోయారు

''తాతయ్యా . కాకి కథ చెప్పవూ'' వాసు ఒకటవతరగతి పుస్తకం తీసుకొచ్చాడు వాసుని ఒడిలో కూర్చో పెట్టుకుని పుస్తకం చేతిలోకి తీసికొన్నారు

''ఒరేయ్ వాసూ !! ఒకసారి ఒక కాకికి

## కుంటి కాకి

బలే దాహమయిందిరా దానికి ఎక్కడా మంచి నీళ్లు దొరకలేదు వెతగ్గా వెతగ్గా ఒక చోట కడవలో అడుగున ఎక్కడోనీళ్లు కనిపించాయి అంత అడుగున వున్న నీటిని ఎట్లా త్రాగాలో కాకికి తెలీలేదు అందుకని అదొక ఉపాయం ఆలోచించింది ఎక్కడికో ఎగురుకుంటూ వెళ్లి చాలా గులకరాళ్లు తీసికొచ్చి కడవలో వేసింది అప్పుడు అడుగున వున్న నీళ్లన్నీ పైకి వచ్చేశాయి అది హాయిగా నీళ్లు తాగి దప్పిక తీర్చుకుని ఎగిరి చక్కా పోయింది చూశావా? కాకి ఎంత తెలివైన పక్షో?'' శివమూర్తిగారు వాసు ముఖంలోకి చూస్తూ అన్నారు

అవునన్నట్లు తలాడించాడు వాసు

''కాళ్లు కడుక్కుని రండి భోజనం వడ్డిస్తున్నాను'' వంటింట్లోనించి కేకవేసింది కాంతం

భార్య పిలుపు వినిన శివమూర్తిగారు ''లేవరా వాసూ మీ బామ్మ భోజనానికి పిలుస్తుంది''అంటూ లేచి బావిదగ్గరకు వెళ్లి కాళ్లు కడుక్కుంటూ జామి చెట్టు పైకి చూశారు కొమ్మల మధ్య వొదిగి కూర్చుంది కుంటి కాకి

ముసిముసిగా నవ్వుకుంటూ వెళ్లి భోజనానికి కూర్చున్నారు

భోజనమైన తర్వాత చిన్న గిన్నెలో అన్నం మెతుకులను వేసుకొచ్చి బావి బొడ్డు మీద వుంచారు అది చూసి కాకి ఎగురుకుంటూ వచ్చి మెతుకులను తిని వెళ్లిపోయి మళ్లీజామి చెట్టు మీద కూర్చుంది

శివమూర్తిగారు తృప్తిగా నవ్వుకున్నారు ఆయనే ప్రతిరోజూ కాకికి అన్నం వేస్తున్నారు మరెవరు దానికి అన్నం పెట్టినా ఆయనకు తృప్తిగా వుండదు తన స్వహస్తాలతో దానికి గిన్నెలో అన్నం పెడితేనే ఆయనకు తృప్తి

* * *

పదిరోజుల తర్వాత ఉన్నట్టుండి కుంటి కాకి కనిపించకుండా హఠాత్తుగా మాయమ

తాతగారు శివమూర్తిగారు మొదట 'ఎక్కడికో పోయింది భోజనం వేళకు అదే వస్తుందిలే' అనుకున్నారు కాని మళ్లీ అది తిరిగి రాలేదు ఆ రోజు శివమూర్తిగారికి ఏమీ తోచలేదు భోజనం చెయ్యబుద్ధి కాలేదు వాసుని వెంట వేసికుని వీధులన్నీ తిరిగారు ఏ చెట్టుమీద, ఏ ఇంటి ప్రహరీ గోడ మీద కాకి కనిపించినా అది కుంటి కాకేనని భ్రమించారు ఆయన ఎంత తిరిగినా ప్రయోజనం లేకుండా పోయింది కుంటికాకి ఎక్కడా కనుపించలేదు

ఆయన మనసును దిగులు పట్టుకుంది అన్నం ముట్టడం మానేశారు జామిచెట్టు క్రింద కుర్చీ వేసుకుని విచారంగా కాకిని గురించే గంటల తరబడి ఆలోచించడం మొదలుపెట్టారు భోజనం చెయ్యమని కాంతం ఎంతగానో బ్రతిమిలాడింది "వెధవ కాకి కోసం దిగులుపడతారా?" అన్నది కాంతం ఎన్ని విధాల చెప్పినా శివమూర్తిగారు తన పట్టు విడువలేదు కాకి తిరిగివచ్చిన తరువాతనే తను మెతుకు కొరుకుతానన్నారు

వారం రోజులు గడిచాయి

శివమూర్తిగారు చిక్కి సగమయ్యారు అనుక్షణం ఆయన కనులముందు కుంటికాకి రూపం, చెవులకు దాని అరుపే మెదులు తున్నాయి

వారం రోజుల తర్వాత ఒకరోజు తెల్లవారే సరికి కుంటికాకి మళ్లీ జామిచెట్టు మీద ప్రత్యక్షమయింది శివమూర్తిగారికి ప్రాణం లేచివచ్చినట్లయింది ఆయన ముఖం దేదీప్యమానంగా కాంతితో నిండిపోయింది కాని దాని అరుపును విన్న తర్వాత, దాని రూపును పరీక్షగా చూసిన తర్వాత ఆయనకు దుఃఖం ఆగలేదు

దాని అరుపులో ఇదివరకున్నంత ఉత్సాహం లేదు చిన్నగా, నీరసంగా, బలహీనంగా అరుస్తోంది ఈకలన్నీ చాలావరకు వూడిపోయాయి బోసిపోయినట్లుగా వుంది దాని రూపు ఆ కాకిని చూస్తుంటె ఆయన హృదయాన్ని ఏదో బాధ మెలిపెట్టినట్లని పించింది

ఆ రోజు ఉదయం శివమూర్తిగారు కాకికి అన్నంమెతుకులు వేస్తే అది మెతుకు ముట్టకుండా వెళ్లిపోయింది దానికేదైనా రోగం వచ్చిందేమో అనుకున్నారు తగ్గిన తర్వాత తింటుందేమో అనుకున్నారు

"రేపు శ్రావణ శుక్రవారం. కోడలు నోము నోచుకుంటుంది కావలసిన సరుకులు తీసుకురండి" ఆ సాయంత్రం శివమూర్తిగారితో చెప్పింది కాంతం

శివమూర్తిగారు బజారుకు బయల్దేరారు

కుంటికాకి ఆయనవెనుకే బజారుకు తనూ బయల్దేరలేదు జామిచెట్టుమీద చలికి వణికిపోతున్న దానిలా ముడుచుకు కూర్చుంది

కావలసిన సరుకులు తీసికుని సంధ్య క్రమంగా వెళ్లబోతున్న వేళ బజారునించి తిరిగి వచ్చారు శివమూర్తిగారు

శివమూర్తిగారిని దూరంనించే చూసిన వాసు పరిగెత్తుకుంటూ ఆయనకు ఎదురు వెళ్లి "తాతయ్యా తాతయ్యా. కుంటి కాకే చచ్చిపోయింది" అని చెప్పాడు

"మన కుంటికాకా" నమ్మలేనట్లుగా ఆశ్చర్యంగా అడిగారు ఆయన

"అవును తాతయ్యా! మన కుంటి కాకే ఇంతకు ముందుదాకా నేలమీద పడి గిలగిలా కొట్టుకుని చచ్చిపోయింది అదుగో! పిల్లలందరూ చూస్తున్నారు."

శివమూర్తిగారి శరీరం కంపించిపోయింది. వడివడిగా నడిచి ఇంటిముందుకు వచ్చారు సైడు కాలువ పక్కనే కాకి చచ్చిపోయివుంది దాని చుట్టూ పిల్లలు గుంపుగా నిలుచుని చూస్తున్నారు

ఎక్కువసేపు అక్కడ నిల్చుని ఆ దృశ్యాన్ని చూడలేక ఇంట్లోకి వెళ్లిపోయారు శివమూర్తిగారు ఆయన కడుపు తరుక్కుపోతుంది దుఃఖం కట్టలు తెంచుకున్న ప్రవాహంలా పొంగి వచ్చింది. తన తండ్రిని పోగొట్టుకున్నట్టుగా బాధపడుతున్నారు ఆయన ఇన్ని రోజులనించీ తనచుట్టూ తిరిగిన కాకి — తన చేతితో పెట్టిన మెతుకులను తిన్న కాకి — ఈ రోజునించీ ఇక లేదు.

## దీప హసితం

—డా॥ సి నారాయణరెడ్డి

నేనూ నవ్వగలుగుతా
 నీలాగే నిశ్శబ్దంగా,
ప్రభాత సరసిలో స్నానమాడే
భాను కిరణంలా
పచ్చిక పొదుగుతో ఆటలాడే
బాల హరిణంలా

నేనూ నవ్వగలుగుతా
నీలాగే నిబ్బరంగా,
కారు మబ్బుల్ని కరిగించిన
శారదేందువులా
అమృత భాండాన్ని ప్రసవించిన
క్షీర సింధువులా

కానీ నేను నవ్వలేను
పచ్చి చీకట్లు పట్టపగలే మెరుస్తుంటే
పల్లేర్లు అడుగడుగునా కరుస్తుంటే
కల్తీ బుద్ధి వేసిన కాటుతో
కాలకూటం తలకెక్కుతుంటే
నేను నవ్వలేను నీలాగా

అయినా నవ్వుతాను మరోలాగా.
హిమానీ శిఖలో పుట్టిన
 కిరణ కుసుమ దామంలా
తమస్సమాధిపై కట్టిన
 జ్వాలా ధూప తోరణంలా
అమావాస్యనే చీల్చుకొని పుట్టిన
అనంత దీపికా శిశుగణంలా
నవ్వుతాను — నిప్పులా నవ్వుతాను



న్నాళ్ళా తన తండ్రితో సమానంగా భావి స్తున్న కాకి ఈ రోజు చచ్చిపోయింది శివమూర్తిగారు శోక సముద్రంలో మునిగి పోయారు

అంత దుఃఖంలోనూ ఆయన మస్తిష్కంలో ఒక ఆలోచన మెదిలింది కాకికి దహన క్రియలు జరపాలని అవును తప్పకుండా దానికి దహనక్రియలు జరపాలి తన తండ్రే ఆ రూపంలో వచ్చాడు తన తండ్రి పోతె దహనక్రియలు జరపలా ??

"కాంతం కాంతం ఇలారా" దుఃఖంతో పూడుకుపోయిన గొంతుతో పిల్చారు శివమూర్తిగారు

"ఏమిటండీ. అవతల కూర మాడి పోతుంటే మీ కేకలు" విసుక్కుంటూ వచ్చింది కాంతం

"మన కాకి చచ్చిపోయిందిగా దానికి దహన క్రియలు జరుపుదామనుకుంటున్నాను" చెప్పారు శివమూర్తిగారు

"హవ్వ " అని ముక్కుమీద వేలేసుకుని "మీకు యేళ్ళు వస్తున్నకొద్దీ మతి పూర్తిగా పోతుంది పశులకు మనుషులు దహన క్రియలు జరపటం ఎక్కడైనావుందా?! ఎవరైనా వింటే నవ్వుతారు. అరవకుండా కూర్చోండి ఏ కుక్కలో దానిని తినేస్తాయిలే" విసురుగా లోపలకు వెళ్ళింది కాంతం

కాంతం మీద పట్టరాని కోపం వచ్చింది శివమూర్తిగారికి

# కుంటి కాకి

'రామాయణంలో జటాయువు చచ్చిపోతే రామలక్ష్మణులు దానికి దహనక్రియలు జరప లేదూ ? జటాయువు పక్షికాదా ?' ఎట్లాగైనా కాకికి దహనక్రియలు జరపాలని నిశ్చయించుకున్నారు శివమూర్తిగారు

ఆరాత్రి ఆయన భోజనం చెయ్యలేదు మిగతావారందరూ భోజనాలు చేసి పక్కలు పరుచుకుని నిద్రపోయారు శివమూర్తిగారికి నిద్రపట్టలేదు కడుపులో ఆకలి మండి పోతుంది ఆవేదనా భారంతో గుండె మండి పోతుంది






గోడగడియారం ఒంటిగంట కొట్టింది

ఉలిక్కిపడినట్లు లేచి కూర్చున్నారు శివమూర్తిగారు అంతా నిద్రాదేవి ఒడిలో విశ్రాంతి తీసుకుంటున్నారు మెల్లగా లేచి వీధి తలుపు దగ్గరకు వచ్చి చప్పుడు కాకుండా తెరిచి బయటకు వచ్చారు వీధిలైటు కాంతి కాలువపక్కనే వున్న కుంటికాకి మీద పడుతోంది ఇంతవరకూ దానిని ఏ కుక్కలో తిని వెయ్యకుండా వుంచినందుకు సంతోషమనిపించింది మెల్లిగా దాని దగ్గరకు వెళ్ళి వణుకుతున్న చేతులతో దానిని పట్టుకుని ఇంట్లోకివచ్చి తలుపుకు గడియపెటి దొడ్డి తలుపు తెరిచి జామిచెట్టు క్రిందికి వచ్చారు








చెట్టుక్రింద దానిని పడుకోబెట్టి స్నానాల గదిలోనించి కట్టెపుల్లలు, చిన్న చిన్న చితుకులు, కిరసనాయిలు సీసా తీసికువచ్చారు క్షణంలో కట్టెపుల్లలన్నీ మండాయి కాకిని ఆ మంటలో వుంచి దానిపైన మరికొన్ని పుల్లలను పేర్చారు కుంటికాకి శరీరం మంటల్లో దహనమవుతూంది

మనుషులను మనుషులు ప్రేమించటం, వారిమీద ఆత్మీయత పెంచుకోవటం సహజం కాని నోరులేని జంతువులను ప్రేమించి వాటిపై మమకారాన్ని, ఆత్మీయతను పెంచుకోటం చాలా అరుదు ఒక్కొక్కసారి ఏదైనా పక్షినిచూస్తే దానిమీద ఎందుకో సదభిప్రాయం ఏర్పడుతుంది ఆ పక్షి మనకు సన్నిహితంగా వస్తే దానిమీద ఆప్యాయత పెరుగుతుంది ఆప్యాయత పెరుగుతున్నకొద్దీ ఆ పక్షితో మనకు ఏదో కనపడని బంధం పెనవేసుకుపోతుంది ఉన్నట్లుండి ఆ బంధం తెగిపోతే ఆ గుండెలో మిగిలేది శోకమే

శివమూర్తిగారి మనసులో ఎన్నో ఆలోచనలు దొర్లిపోతున్నాయి తన తండ్రిపోయిన రోజు కూడా ఇంతే తను మరోసారి తండ్రిని పోగొట్టుకున్నట్లు బాధపడుతున్నారు ఒక వైపు కాకి మంటల్లో కాలిపోతున్నందుకు ఆయన హృదయం దహించుకు పోతున్నా కుక్కలపాలు పడకుండా కాకిని పవిత్రంగా దహనం చేస్తున్నందుకు ఆయనకు ఎంతో తృప్తి అనిపించింది

నిద్రమెలకువ వచ్చి లేచి చూసిన కాంతంకు కుర్చీలో శివమూర్తిగారు కనిపించ లేదు దొడ్డితలుపు దగ్గరకు వేసివుండటం కనిపించింది దొడ్లో ఏదో కాలుతున్న వాసన మంచం మీదనించ క్రిందికి గుమ్మంవైపు నడిచింది కాంతం

దొడ్డి తలుపు తీసిన కాంతంకు జామిచెట్టుక్రింద గొంతుక్కూర్చుని, తదేకంగా మంటను చూస్తూ తృప్తిగా కన్నీళ్లను కారుస్తున్న శివమూర్తిగారు మంట వెలుగులో కనిపించారు

ఆ దృశ్యం చూసిన కాంతం కనుల వెంబడి రెండు కన్నీటి చుక్కలు రాలాయి.




చక్కని వెలుతురుకు

కే. ఎస్. ఏ. కార్పొరేషన్,
'లాంప్ హౌస్', 24/38, పుష్పమ్మ లేన్,
విజయవాడ - 10.

జి. ఏ. పరశురామ్ & కో.,
హైదరాబాద్ - 500004 (A.P).

సోమవారం



ఫ్లాష్
సమకూర్చే సున్నితమైన
ముఖక్షౌరంవలన ఎంతో నున్నగా
గెడ్డము గీసుకున్న అనుభూతి

మంగళవారం

అదనంగా
మరో 24 గంటలు
నిలిచే అనుభూతి

బుధవారం



ఫ్లాష్
సమకూర్చే సున్నితమైన
ముఖక్షౌరంవలన ఎంతో నున్నగా
గెడ్డము గీసుకున్న అనుభూతి

గురువారం

అదనంగా
మరో 24 గంటలు
నిలిచే అనుభూతి

శుక్రవారం



ఫ్లాష్
సమకూర్చే సున్నితమైన
ముఖక్షౌరంవలన ఎంతో నున్నగా
గెడ్డము గీసుకున్న అనుభూతి

శనివారం

అదనంగా
మరో 24 గంటలు
నిలిచే అనుభూతి




ఫ్లాష్ ఓ అద్భుతమైన బ్లేడ్ అది ఎంతో నున్నగానూ, సున్నితంగానూ గెడ్డాన్ని గీస్తుంది.
నున్నగా గెడ్డాన్ని గీసుకున్న అనుభూతిని మీలో నిజంగా ఎంతో కాలం కలిగిస్తుంది

# దీపావళి వేడుకలు

వేడుకలు ప్రధానమైన పర్వాలలో దీపావళి మొదట చెప్పదగినది. పార మార్థిక దృష్ట్యా కొందరికి యీనాడు వరుసగా దీపాలు పెట్టడం, కొందరికి కేదారగౌరీపూజ ముఖ్యములు. వేడుకలు దృష్ట్యా పిన్నలకూ, పెద్దలకూ కూడా దీపావళి చాలా ముఖ్యమైనది. అందులోనూ బాణసంచు వేడుకల పండుగ ఇది ఒక్కటే !

ఇంకా పండుగ పది, పదిహేను రోజులుండగానే దీపావళి అచిరకాలం లోనే రాబోతున్నదని తెలుపుతూ టపాకాయల ధ్వనులు వినబడుతూ ఉంటాయి. నరకచతుర్దశి, దీపావళి అమావాస్య రెండు రోజులూ ఈ ధ్వనులతోపాటు మతా బులు వింత వింత రంగుల వెలుగులను వెదచల్లుతూ ఉంటాయి.

ఈ వేడుకలలో మొదటిది నరకాసుర దహనం. త్రయోదశినాటి రాత్రే గడ్డితోనూ, కర్రలతోనూ నరకాసుర విగ్రహాన్ని భయంకరంగా తయారు చేసి, కాగితాలు అతికించి రూపం నిర్మించి సిద్ధంగా ఉంచుకుంటారు. తెల్లవారుజామున లేచి పిల్లలందరూ డబ్బారేకుల భజంత్రీమేళంతో ఆ వికార విగ్రహాన్ని వూరేగించి, వూరిఅవతల దహనంచేసి వచ్చి, తలంటి నీళ్ళు పోసుకుని కొత్తబట్టలు కట్టుకొని ఫలహారాలు చేస్తారు. ఆ రోజు చాలావరకూ టపాసులు కాల్చడంతోనే జరిగిపోతుంది. ఆరోజు రాత్రి, ఆకాశం మీదికి పోయే తారాజువ్వలతోనూ, నిలువు, నిలువున్నర ఎత్తున రంగు రంగుల వెలుగుపూవులను వెదచల్లే చిచ్చుబుడ్లతోనూ, మతాబుల తోనూ పట్టపగలుగా వెలిగి పోతుంది.

ఇప్పట్లో ఎక్కువ డబ్బు ఖర్చు చేసినా—దక్షిణాదిని శివకాశి మొదలైన వూళ్ళలోని ఫ్యాక్టరీలలో తయారైన బాణ సంచు వస్తువులు కొద్దిగా లభిస్తాయి వెనకటి రోజులలో స్వయంగా తయారు చేసుకుంటూ ఉన్నందువల్ల తక్కువ డబ్బుకు ఎక్కువగా వచ్చేవి.

అసలు టపాసులు, టపాకాయలు అనే పేర్లే విచిత్రంగా ఉన్నాయి. 'టప్' అనే ధ్వనికి అనుకరణ పదాలని చెప్పలేము. పెద్ద ధ్వనులను ఇచ్చే యివి 'టప్' అనే చిన్న చప్పుడు చేస్తున్నట్లు చెప్పడం సరికాదు. వీటిని తయారు చేసే సామగ్రిని బట్టే కొన్ని పదాలు ఏర్పడి అవి తారుమారై యీ పేర్లు ఏర్పడినవని చెప్పుకో వలసి ఉన్నది.







వెనకటి రోజుల్లో పొటాసియం, మణిసిలలను వేర్వేరుగా పొడిచేసి అతి జాగ్రత్తగా కలిపి ఉంచుకుని చిన్న చిన్న కాగితపు ముక్కలలో ఆ పొడి కొంచెం కొంచెంవేసి సన్నపాటి కంకరరాళ్ళు రెండు మూడింటితో సహా చేర్చిమూసి, కాగి తపు ముక్కలతో ఉండగా చుట్టి గోగునారదారంతో గట్టిగా కాయవలె కట్టేవారు అలా తయారు చేసేటప్పుడు ప్రేలేప్రమాదం ఉన్నది. అందువల్ల వీటితయారీ తోటల్లోనూ, దొడ్లలోనూ మాత్రం జరిగేది. ఇలా తయారైన ఉండలు ఇప్పటి "ఆటంబాంబు" పటాసులకంటె ఎక్కువ ధ్వని యిచ్చేవి. వీటిని గోడపైకి విసిరి కొట్టినా, నేలపైకొట్టినా గొప్పధ్వని అయ్యేది. వీటిలో పొటాసియం శక్తి ఎక్కువ అందువల్లనే ఇది పటాస్‌కాయలని వాడుకపడ్డాయి. 'పటాస్' అనేదే తారుమారై టపాస్‌గానూ, టపాగానూ మారిపోయింది. అదే యిప్పుడు స్థిరంగా నిలిచిపోయింది!

కంకరరాళ్లకు బదులు ఎర్ర,పచ్చ మతాబుపుల్లలనూ, కాగితాలకు బదులు తాటాకులనూ ఉపయోగించి వీటిని తయారు చెయ్యడమున్నూ ఉండేది.

సురేకారం, గంధకం పొడిచేసి, తగినపాళ్ళలో మిశ్రంచేసి వెన్నముద్దలు మున్నగు మతాబులను తయారు చెయ్యడమూ ప్రమాదంలేని తయారీ.

పటాకీలను కూడా ఇలాటి ప్రేలుడు పదార్థాలతోనే తయారు చేసేవారు.

ఈ విధంగా అతిస్వల్ప వ్యయంతో వందలకొద్దీ టపాకాయలను, పటా కీలను తయారు చెయ్యడం సాధ్యపడేది.

తాటిపువ్వును తెచ్చి, బాగుగా కాల్చి గొయ్యితీసి ఆ గోతిలో ఉంచిమట్టితో కప్పి ఒకరోజు ఉంచేవారు. తర్వాత దానినితీసి పొడిచేసి, ఉప్పుపొడిని చేర్చి, గుడ్డ లను పొడుగుగాచీరి వాటిలో ఈ పొడిని గుడ్డపొడవునా పల్చగాపోసి, మడిచి, కొనలు చీరిన సన్నని కర్రలకు ఆ గుడ్డపొట్లము తగిలించి, గట్టిగాకట్టి పేడను బాగుగా ఆ పొట్లాలకుపూసి ఎండబెట్టేవారు. ఈ పండుగునాటి సాయంకాలం, ఆ పొట్లాలపై నిప్పువేసి, అదిబాగారాజుకొన్న పిదప కర్రపట్టుకుని గిరగిరా తిప్పి నట్లయితే ఆ పొట్లము నుంచి చిన్నచిన్న వెలుగుపువ్వులు రాలుతూ వినోదాన్ని కలిగించేవి. రమారమి గంటవరకూ ఇలా పొట్లాన్ని తిప్పిపిల్లలు వినోదించేవారు.

ఈ విధంగా వెనకటిరోజుల్లో బాణసంచును తయారు చెయ్యడంలోనే అప్పటివారు ఎక్కువ ఉత్సాహాన్ని చూపేవారు. తయారు చెయ్యడంలోనే వారికి తృప్తి. ఇలా ఎంతో శ్రమపడి తయారు చేసిన వస్తువులు కొలది క్షణాలలో ప్రేలి, వెలిగి స్వరూపం లేకుండా పోతాయి. ఇలా వాటిని కాల్చివెయ్యడంలోనే వేడుక !

—ఆంగీరస.

## ఉత్తరాలు

(4వ పేజీ తరువాయి)

ఈ దేశంలో దొంగ నిల్వదారులకు కరువేలేదు. వీరి బాదే పడలేకుంటే, మన ప్రభుత్వం కూడారైతుల నించి సేకరించిన ధాన్యం నిలువయుంచి, పరాయి రాష్ట్రాలకు అమ్ముతుంటే, సామాన్యుడు బ్లాక్ మార్కెటీర్ల నాశయించక ఏం చేస్తాడు ?

సాతవల్లి సత్యనారాయణ, (కడప.)

సీరియల్

'కాకాని కమల' గారి "లాలస" సీరియల్ చాల బాగుంది. డాక్టర్ శ్రీనివాస్‌కి, రమేష్ చాల చక్కగా బుద్ధి చెప్పినారు. దానితో శ్రీనివాస్ పశ్చాత్తాప పడ్డారు.

సీనున్నాయుడు (గార)

ముఖచిత్రం

25—10—74 ఆంధ్రసచిత్రవారపత్రికపై మా అభిమాన నటి "వూర్వశి శారద" ముఖ చిత్రం అత్యంత ఆకర్షనీయంగా వుంది.

చింతా రంగనాయకులు, (ప్రెసిడెంట్ శోభన్ ఫ్యాన్స్ అసోసియేషన్, (ధర్మవరం.)

సీరియల్

# ఇద్దరమ్మాయిల కథ

ఎమ్. హేమలత



"అనితా, ఎస్."

రెండవ మారు పిలవ వలసి రావడంవల్ల కాబోలు, ఇంగ్లీషు మేడమ్ కంఠం కొంచెం కోపంగా పల్కింది. కొత్త పిల్లవంక ఆసక్తిగా చూస్తూ కూచున్న, అనిత, వులిక్కిపడి, "ప్రెజెంట్ టీచర్," అంది.

మేడమ్ మిగతా పిల్లల పేర్లను పిలువ సాగింది.

క్లాసులోకి కొత్తమ్మాయి వస్తే పిల్లలకు చాలా సరదాగా వుంటుంది. "ఈ కొత్త పిల్ల ఎవరిపక్క కూచుంటుందో — ఎవరితో దోస్తీ కల్పుతుందో—!" ప్రస్తుతం వారి ఆలోచనలివే.

"ఏయ్ రాధా! కొత్తమ్మాయి పేరేంటోయ్!" ఆసక్తిని, వుత్సుకతని చంపుకోలేక, పక్కనున్న ప్రభావతినడిగింది అనిత.

"ఏమో, హా ఏమై టు నో, అదుగో టీచరడుగుతున్నారు"

టీచర్ ప్రశ్నకి బెరుకు — బెరుకుగా సమాధానం వచ్చింది కొత్తమ్మాయినుంచి "మాధవి !" అని

తతిమ్మా పిల్లలందరూ, ఒకరి మొహాలొకరు చూచుకొని నవ్వుకున్నారు ఆఖరి బెంచీలలో వున్న అమ్మాయిలకు విన్పించలేదు కాబోలు, "ఏమిటేమిటి ?" అంటూ గుసగుసలు పోతున్నారు

టీచర్కి వాళ్ళని చూస్తే నవ్వొచ్చింది వాళ్ళ సరదాలలో పాలు పంచుకోవాలని వున్నా, తామున్నది మరి టీచర్ హోదా కాబట్టి, "సైలెన్స్" అంటూ, ఒక్కమారు గద్దించి, "మాధవీ, చూడు, నువ్విలా వచ్చి కూచో," అంటూ, అనిత ప్రక్కసీటు చూపించింది

మాధవి నెమ్మదిగా వచ్చి, అనితప్రక్క చోటు చేసుకుంది. అనిత, విజయ గర్వంగ అందర్నీ చూచింది

పాఠం మొదలవడంతో, పిల్లలందరూ పుస్తకాలు తెరిచారు అనిత, తన పుస్తకాన్ని మాధవికి కన్పించేలా పక్కకి జరిపి పెట్టింది. మాధవి, అనిత పుస్తకంలోకి చూస్తూ కూచుంది. కాని, అప్పటికే ఇరవై రోజుల పాఠం జరిగిపోవడంతో, టీచర్ చెప్పే పాఠం, మాధవికి సరిగ్గా అర్థంకాలేదు. కాస్సేపు పుస్తకంవేపు, కాస్సేపు అనితవేపు చూస్తూ కూచుంది మాధవి

చక్కటి నీలం—తెలుపు యూనిఫారమ్‌లో వుంది అనిత మోకాళ్ళవరకు పాలనురుగులా తళతళలాడుతూన్న నైలెక్స్ సాక్స్, నల్లటి నిగనిగలాడే బూట్స్, రెండు జడలకి తెల్లటి రిబ్బన్‌లు, మిసమిసలాడే రంగు, గులాబీ బుగ్గలు — అనిత అందంగా, భాగ్యవంతుల పిల్లకి కావలసిన లక్షణాలన్నీ పుణికి పుచ్చుకొని, రాజసంగా వుంది. మాధవి, తెల్లగా పుతికిన తన పువ్వుల చీటీ ఫ్రాకుకేసి కాళ్ళకున్న హవాయ్ చెప్పులకేసి చూసుకుంది

సాయంత్రం వాళ్ళయ్యేసరికి, అనిత — మాధవి బోల్డు కబుర్లు చెప్పుకున్నారు మిగతా పిల్లలడిగే ప్రశ్నలకి మాధవికన్న ముందుగా జవాబు చెప్పేంత దగ్గరిగా వచ్చింది అనిత

"నీ పేరు నాకు చాలా నచ్చింది మాధవీ! చాలా బాగుంది — ఫేషనబుల్‌గా," క్లాసు నుండి బయటికివస్తూ, అంది అనిత

"మా తాతగారి పేరు మాధవరావుగారు మా నాన్నగారికి నేనే ముందు పుట్టాను అందుకని, ఆడపిల్లనుకదూ, మాధవీ అంటూ మా తాతగారిపేరు కలిసేలా, పెట్టారు"

అనితకెందుకో మాధవి సమాధానం నచ్చలేదు మాధవి అంటే బాగుందికాని, మాధవ రావు అంటే ఆ పిల్లకెందుకో నచ్చలేదు

"ఎలా వెళ్తావు మాధవీ? మీ ఇల్లెక్కడ ఇంతకీ ?"

మాధవి జవాబిచ్చింది

'అరే ! మా ఇల్లు అటు వేపే మరింకేం ఇద్దరం కలిసే వెళ్ళొచ్చు కాస్త ఆగు మా జీప్ వస్తుంది," జీప్ కోసం ఎదురుచూస్తూ నిల్చున్నారు మాధవీ — అనితలు

ఇంతలో మాధవి ప్రక్కింటి వారమ్మాయ్ సరస్వతి స్కూలు బయటకు వచ్చింది

"ఇక్కడున్నావా . ? నీ కోసమే వెతుకుతున్నాను మీ అమ్మగారు నిన్నీరోజు మా రిక్షాలో తీసుకరమ్మన్నారు రా వెళదాం " సరస్వతి పిలవడంతో, మాధవి అనితవద్ద సెలవు తీసుకుంది సరస్వతి పదవ తరగతి చదువుతూంది అనితకి సెంత్ పిల్లలంటే కాస్త భయం ఉంచేత అన్నాదలి సరస్వతి వెంట వెళ్తున్న కొత్తమ్మాయి మాధవికేసి చూస్తూ నిల్చుండి పోయింది

---

## ఈ దీపావళి !

సమస్యల వడగాడ్పులకు
ఆశయాల దీపాలు ఆరిపోతుంటే
అక్రమాల చీకటి తెరలతో
'సంఘం' అమావాస్య రాత్రిలా
భయపెడుతుంటే
ఆశల తారాజువ్వలు తుస్సుమని పోతుంటే
మంచితనం మతాబులు క్షణమైనా
వెలగకుంటే
నీతి, న్యాయం చిచ్చుబుడ్లు నిలిచి
కాల కుంటుంటే
నైరాశ్యాన్ని, నిస్పృహాన్ని కౌగలించుకుని
విరిగిన కలల్ని తలచుకుని
"దీపం" వెలుగులో
తన రూపాన్ని చూసుకుని, జడుసుకుని
నిద్రలేక మనిషి వణుకునే రోజు
ఈ దీపావళి !

— కళింకోట ప్రభాకరదేవ్.

---

## 2

"మమ్మీ, మమ్మీ ! నాకో "న్యూఫ్రెండ్" దొరికింది ఈవేళే మా క్లాసులో చేరింది. నా బెంచ్ మేట్‌కూడా అయింది మమ్మీ !" సుడిగాలిలా దూసుకు వచ్చిన అనిత, టేబిల్ దగ్గర నిల్చొని పండ్లరసం తీస్తున్న కాత్యాయన్ని చుట్టేసింది

"అరే, ఏంటా హడావిడి అనూ ! కొత్తమ్మాయి కాదు కానీ, నీకోసం నే తీస్తున్న పండ్లరసం నేలపాలయ్యేటట్టుంది"

అమ్మ అందిచ్చిన పండ్లరసాన్ని త్రాగుతూ, "మమ్మీ ఎంత స్వీట్‌గా ఉందో తెలుసా, ఆ అమ్మాయ్ పేరు మాధవట ఎంతో నైస్‌గా మాట్లాడింది అసలు మన జీప్‌లో పిల్చుకొద్దామనుకున్నాను

రసం మింగుతూ, మధ్య మధ్య మాట్లాడేస్తున్న అనితని చూచి, కాత్యాయనికి నవ్వొచ్చింది

"సరెలే ! నీ కబుర్లు తర్వాత చెబుదువు కానీ తొందరగా వెళ్ళి కాళ్ళు, చేతులూ కడుక్కురా ఈరోజు క్లబ్బులో ఆనివర్సరీ. నే తొందరగా వెళ్ళాలి నువ్వూ తమ్ముడూ, తర్వాత డాడీతో రండి," కట్లెట్ ప్లేట్ని టేబిల్‌మీద పెడుతూ ఉంది కాత్యాయని

అప్పటికే బూట్సుని విప్పి, సోపాలోకి జారి గిలపడి భార్య తెచ్చి యిచ్చే కాఫీకోసం వెయిట్ చేస్తున్నాడు రంగారావ్

"నీతేంటోయ్-అంత హాపీగా వుంది ?" కాఫీ కప్పునందుకుంటూ, కాత్యాయన్ని పల్కరించాడు రంగారావు

"ఆ, ఏముంది, కొత్త ఫ్రెండంటూ మురిసిపోవడం, మళ్ళీ అంతలోనే బేడ్ గర్ల్ అంటూ దెబ్బలాడుకోడం" సాగదీసింది కాత్యాయని.

"మీ ఆడవాళ్ళకి అది పుట్టుకతోనేఅబ్బిన గుణమేగా! క్రొత్తలో ఎక్కడ్లేని స్నేహాలు పెంచుకోవడం—అంతట్లోకే విరోధంలోకి దిగడం .."

"సర్లెండి, పెద్ద ! సైకాలజిస్టు బదుల్దేరారు మీతో వాదనపెట్టుకొని కూచోడానికిక్కడెవరికీ టైంలేదు మీరు వచ్చేటప్పుడు బాబ్జీని—అనూను కూడా తీసుకరండి వెహికల్‌లో"

"జీ హుజూర్" అంటూన్న భర్త మాటలకు నవ్వుకుంటూ బయటకి నడిచింది కాత్యాయని.

## 3

"అమ్మా, తినడానికేమైన పెట్టవా—ఆక

లేస్తోంది''అంటూ, లోపలికి వచ్చిందిమాధవి.

''అటుకులు నానపోసానమ్మా,పాలుపోసుకు తింటావని ఈ బుజ్జిగాడితో చచ్చే చావొచ్చింది వాడికి కాళ్లు రావడం కాదు కాని నా దుంప తెగిపోతోంది ఎప్పుడొచ్చాడో, గిన్నెలోని పాలు వంపేసి తెగనవ్వుతున్నాడు!'' వుసూరుమంటున్న అమ్మ సుగుణమ్మను సమీపించింది మాధవి

''ఫరవాలేదు లేమ్మా బెల్లం ముక్క కల్పుకుతింటా''అటుకులు బెల్లంముక్క తీసుకొని వంటింట్లో కుంపటి విసురుతున్న అమ్మ పక్క కూచుంది మాధవి

తప తప అడుగులతో నవ్వుకుంటూ వస్తున్న తమ్ముణ్ణి దగ్గరికి లాక్కుంటూ, ''అమ్మా, మాక్లాస్ పిల్లల్ని నువ్వు చూడలేదు కదూ! అబ్బ, ఎంచక్కా డ్రెస్ చేసుకున్నారో మా పాత స్కూల్లో అయితే, పిల్లలంతా పిచ్చి పిచ్చిగా వచ్చేవారు కాని, ఈకొత్త బళ్లో – ఎంత స్టైల్‌గా వున్నారనుకున్నావ్. ?'' కొత్త బడి కబుర్లు



రిత్తపోయి వింటున్న తల్లితో చెప్పకొని పోతుంది, మాధవి

''చూడమ్మా మాధవీ! పిల్లలు ఎంత మంచి బట్టలు తొడుక్కున్నారన్నది ముఖ్యం కాదమ్మా, వాళ్లెంత బాగా చదువుతున్నారన్నదే మనకు కావల్సింది మీ నాన్నగారు ఎంతో కష్టం మీద నిన్ని కాన్వెంట్ లో చేర్పించారమ్మా శ్రద్ధగా చదువుకోవాలి,'' అంటూ, బియ్యం కడగడానికి గిన్నె పుచ్చుకొని లేచి వెళ్ళింది సుగుణమ్మ

''అమ్మా! యూనిఫారమ్ కుట్టించుకోవాలట యూనిఫారమ్‌లో రాకుంటే ఇంటికి పంపించేస్తారట!''

''ఊఁ. అలాగే మీ నాన్నగార్కి జీతం రాగానే బట్టలు కొందాం బుజ్జిగాణ్ణి కాస్సేపు ఆడించుకుంటావా, నేను వంట పూర్తిచేసుకుంటాను రేపటికి వడియాలకి గుమ్మడికాయ తరుక్కోవాలి ..''

బుజ్జిని చంకలో వేసుకుని, సావిట్లోకి వెళుతున్న మాధవి కేసి చూస్తూ నిట్టూర్చింది సుగుణమ్మ

చిన్నప్పటినుండి ప్రతి క్లాసులోను ఫస్టుగా వస్తున్న మాధవికి, అమ్మా నాన్నలంటే అమిత గౌరవం ఏ విషయమైనా ఇట్టే ఆకళింపు చేసుకునే శక్తి, ఒక మారు చదివితే ఎప్పటికి గుర్తుంచుకొనే జ్ఞాపకశక్తి, ఆ పిల్లకి దేవుడిచ్చిన వరాలు మధ్య తరగతి కుటుంబీకులైన మాధవి తల్లి దండ్రులకి, కాన్వెంటు చదువును భరించడం అంత తేలికైన పని కాదు కాని, పిల్ల తెలివితేటలకు ముచ్చటపడి చేర్పించారు కాన్వెంటులో సుగుణమ్మ చదివింది ఎస్. ఎస్ యల్ సి వరకే అయినా ఆవిడకి పిల్లల చదువుపట్ల మంచి ఆసక్తి ఎంత కష్టమైనా సరే పిల్లలకి మంచి విద్య ఇవ్వాలన్నదే ఆ తల్లి దండ్రుల ధ్యేయం మాధవి తర్వాత పిల్లలిద్దరూ పోవడం, బుజ్జిగాడు వరీ చంటివాడు కావడం, మాధవిపై ఆ దంపతు

లకు ప్రత్యేక శ్రద్ధ కల్గేలా చేసింది.

కొత్త స్కూల్లో బాగా అలవాటు పడి పోయింది మాధవి క్లాసు పుస్తకాలన్నీ కొనేసి వాటికి చక్కటి అట్టలుకూడా వేసేసు కుంది మిగతా టైంలో అందరితో కబుర్లు చెబుతూ సరదాగావున్నా, క్లాసులో మాత్రం పాఠాలని శ్రద్ధగా వినేది మిగతా పిల్లల్లా కామిక్స్ టెక్స్టుబుక్కుల మధ్య పెట్టుక చదివేదికాదు అనిత, మాధవితో వున్నంత సేపూ బుద్ధిగానే వుండేది కాని తర్వాత పిల్లలతో కలిసి అల్లరి చేసేది

క్రిస్మస్ పండుగ సందర్భంగా కాన్వెం టులో ఆటలపోటీలతోబాటూ, వ్యాస రచన పోటీ కూడా జరిపారు "గుడ్ హేబిట్స్" అన్న సబ్జెక్ట్‌మీద వ్యాసం రాసారు పిల్లలు చక్కటి వ్యాసం రాసిన మాధవి ఫస్ట్‌ప్రైజ్ కొట్టేసింది. హెడ్‌మిస్ట్రెస్ అసెంబ్లీలో మాధవిపేరు చదివారు

క్రిస్మస్‌నాడే బహుమతి ప్రదానం తల్లి దండ్రులకు కూడా ఆహ్వానాలు పంపారు పేరెంట్స్–జంట జంటలుగా వస్తున్నారు. సిస్టర్స్ వాళ్లని ఆహ్వానించి కూచోబెడ్తు న్నారు జీపులోంచి హుందాగా దిగిన రంగారావు దంపతులను, సాదరంగా ఆహ్వా నించింది హెచ్ ఎం లలితకి వచ్చింది థర్డ్ ప్రయిజే అయినా, వాళ్లకి కొండెక్కినంత సంబరంగా వుంది మాధవి వస్తున్న వాళ్లం దరిని చూస్తూ వేదిక దగ్గర కూచుంది మాధవికి తెలుసు – వాళ్ల అమ్మా నాన్నలు రారని ప్రొద్దుటే నాన్నగారు చెప్పారు, "అర్జెంట్ వర్కుందమ్మా, సారీ," అంటూ అమ్మ వద్దామనే అనుకుంది కాని బుజ్జి గాడికి జ్వరం రావడంతో "ఒంటిలో ఎలా రానమ్మా !" అంటూ, మానుకుంది పాపం, మాధవికి చాలా అసంతృప్తిగా వుంది తనపేరు చదివినప్పుడు, తనొచ్చి బహుమతి తీసుకుంటున్నప్పుడు అమ్మానాన్నలు అక్కడ లేకపోవడం, ఆ పిల్లకి చాలా కొరతగా అని పించింది ఫస్ట్ ప్రయిజ్ తీసుకున్న మాధవి కన్న, థర్డ్‌ప్రయిజ్ గెల్చుకున్న లలిత బుగ్గలే ఎక్కువ గిల్లాడు, బహుమతి ప్రదానం గావిం చిన ఆ వూరి కలెక్టర్ ఎ వి రావ్ పోను మరి, అనిత వేసుకున్న ఫ్రాకు ఖరీదులో ఐదో వంతు కూడా చేయవు, మాధవి తొడుక్కున్న లంగా జాకెట్లు ప్రయిజు చేతబుచ్చుకొని, ఠీవిగా వస్తున్న అనితను ఆప్యాయంగా దగ్గరికి





అక్టోబరు 28 వ తేదీన విజయవాడలో పట్టపగలు జరిగిన హత్యాకాండలో హతులైన 5గురిలో ఒకడైన శ్రీ వంగవీటి రాధాకృష్ణ 28 ఏళ్ల పిన్న వయస్సులోనే యిరవై ఎనిమిది పైచిలుకు ట్రేడ్ యూనియన్ సంస్థలకు నాయకుడై రాణించిన యువజన, కార్మిక వీరుడు. అతన్ని అనుచరులు —అభిమానులు — అయినవారూ,అంతా'రాధా'అనే వ్యవహరిస్తారు— "ఉస్తాద్" అని కొందరు కొలుస్తే "అన్నా"అని చాలామంది ఆరాధించారు అనుచరుల కతనొక అరివీర భయంకరుడు నిస్వార్థ సేవకుడు — ధూమపానం కూడా చేయని బ్రహ్మచారి — పరిశీలకులు కొందరు అతణ్ణి లభినవ "రాబిన్ హుడ్" అని కూడా అంటారు. వ్యాపారం చేసినా, విరాళాలు పోగుచేసినా తనకోసం చేయని విరాడం బరుడంటారు 'రాధా' ని తెలిసిన వారంతా — లతని గురించి కథలెన్నో వున్నాయి కొత్తగా వినేవారికు కట్టుకథల్లాగ ఆశ్చర్య జనకంగా వుండొచ్చును కాని 'రాధా' వనుపాల కవి నిత్య సత్యాలు కొంచెం కాలంలో కొండంత ఎదిగిన 'రాధా' ఆంధ్రసచిత్ర వారపత్రిక పాఠకులకుకూడా 'హో మనిషి'అనే తనరచన ద్వారా (11—10—'74) పరిచితుడు (ఎ. ఎ.)

లాక్కున్నారు అనిత తల్లిదండ్రులు. ఫస్ట్ ప్రయిజ్ని గుండెల కదుముకుంటూ నిస్సహాయంగా నిల్చుండిపోయింది మాధవి.

*4*

"నాన్నా మరి నా ఫ్రెండ్ అనిత లేదూ వాళ్ల నాన్నకి జీపుంది అదెప్పుడు జీపులోనే వస్తుంది స్కూల్కి మనకెందుకు లేదు నాన్నా జీపు" ఫైళ్లతో కుస్తీపడుతున్న గుమస్తా రామారావుని ప్రశ్నించింది మాధవి

"ఓ అదా అనితా వాళ్ల నాన్నగారు టూరింగ్ ఆఫీసర్ మధూ ఆయనికి కాంపు

## ఇద్దరమ్మాయిల కథ

లవీ వుంటాయ్ అందుకని జీపిచ్చారు"

"కాంపులకయితే-మరి అనిత స్కూలుకి, బజార్లకి, సినిమాలకి కూడా జీపులోనే వెళుతుందట . !"

"చూడమ్మా, బుజ్జిగాడు అమ్మనేడిపిస్తున్నట్లున్నాడు కాస్త వాణ్ణి ఎత్తుకో" మాధవి మారు మాట్లాడకుండా లోపలికి వెళ్లింది-సమాధానం దొరకని ప్రశ్న ఇంకా బుర్రలో తొలుస్తుండగా !

సెవంత్ క్లాస్ పరీక్షలు అందులోనూ కామన్ ఎగ్జామ్స్ పిల్లల హడావిడి ఇంతా అంతా కాదు. హాల్ టికెట్స్ తీసుకోపోతున్న పిల్లలు-అదేదో పేద్ద ఐ ఏ యస్ పరీక్షయి ఎట్లు భయపడి పోవడం మొదలెట్టారు పరీక్షలు రాసేది వేరేచోట కొత్త చోటుకి వెళ్లి పరీక్షలు రాయడం వాళ్లకేదో భయంగా, గర్వంగా కూడా వుంది

మాధవి పరీక్షకు బయల్దేరుతూంది సుగుణ, దేవునిదగ్గర దీపం వెలిగించి,

(44 వ పేజీ చూడండి)



HONEY BEE











# చెయిజారిన స్వర్గం

మోర్తల గోపాలరెడ్డి

ఆగిన రిక్షాలోంచి చూసిన రాజమ్మకు తలుపుకు వేళ్ళాడుతున్న లావుపాటి హారిసన్ తాళం కనిపించింది ఇంత ప్రొద్దుటే తమ్ముడు ఎక్కడికి వెళ్ళి వుంటాడబ్బా అనుకుంటూ రిక్షావాడికి డబ్బులు యిచ్చి రిక్షా దిగింది ఇంటిముందు వున్న అరుగు మీద కూర్చుంది రాధ భవిష్యత్తు, తమ్ముడిలో కలిగిన మార్పు గురించి ఆలోచిస్తున్న రాజమ్మకు పసిపిల్లవాడి ఏడ్పు వినిపించి, అది బుజ్జిగాడి ఏడ్పు అని గ్రహించడానికి ఎక్కువసేపు పట్టలేదు పాలు మానని పసికందును యింట్లో పెట్టి తాళం వేసి వెళ్ళిన తమ్ముడి కఠిన హృదయం మీద విపరీతమయిన కోపం కలిగింది ఇంట్లో పిల్లాడు గుక్కపట్టి ఏడుస్తున్నాడు రాజమ్మకు ఏం చేయాలో పాలుపోక కంగారుగా అటూ యిటూ తిరిగింది అరగంటయ్యాక చంద్రం వచ్చాడు. ఏడాది క్రితం శాంత పెళ్ళినాడు చూసిన చంద్రానికి, ఎదురుగా కనిపిస్తున్న చంద్రానికి శారీరకంగా పెద్ద మార్పు లేకపోయినా మానసికంగా ఎంతో మారిపోయిన చంద్రం గురించి ఆలోచనలో పడింది

"ఏరా చంద్రం ! బావున్నావా ?"

అంతవరకు తల వొంచుకుని వచ్చిన చంద్రం తలెత్తి చూశాడు అంత అకస్మాత్తుగా ఎప్పుడు అక్కను చూడగానే నోట్లో వున్న సిగరెట్టు తీసిపారేయడమా వుంచుకోవడమా అనే సందిగ్ధంలో పడి చివరికి రెండో పనే చేశాడు అంతకు ముందెప్పుడూ తన ఎదుట సిగరెట్టు కాల్చడానికి సాహసించని తమ్ముడు నోట్లోంచి సిగరెట్టు తీయకపోయినందుకు రాజమ్మ అంతగా ఆశ్చర్యపోలేదు

"ఎంతసేపయిందక్కా వచ్చి" అని మర్యాద కోసం కూడా అనకుండా మౌనంగా తాళం తీస్తున్న తమ్ముడి వాలకానికి రాజమ్మ మనసు చివుక్కుమంది

ఆడదిక్కు లేని యిల్లు ఎలా వుంటుందో ఆ లక్షణాలన్నీ ఆ యింటికి ఒక రెండు వారాల్లోనే అబ్బినాయి

"ఏరా చంద్రం మాట్లాడవేం ?" స్వతంత్రంగా అంది రాజమ్మ, నిశ్శబ్దాన్ని యింకా రాజ్యమేలనివ్వడం యిష్టంలేక

"అంత దూరం నుంచి నువ్వు పని కట్టుకు వచ్చింది మాట్లాడ్డానికేగా నువ్వే మాట్లాడు" అని సూటిగా ఓసారి రాజమ్మ వైపు చూశాడు

తమ్ముడి వద్దనుండి అంత తీవ్రమయిన సమాధానానికి ఎదురు చూడని రాజమ్మ క్షణంపాటు దిమ్మెరపోయింది చిన్నతనం నుండి తనంటే భయపడినట్టు నంగి నంగిగా మాట్లాడే తమ్ముడేనా అనిపించింది ముంత దాచడం అనవసరం అనికూడా అనిపించింది

*(గత సంచిక తరువాయి)*

"దాన్ని ఒక్కదాన్నే పంపకపోతే మాకు ఒక కార్డుముక్క రాసిపడేస్తే పోయేదిగా అది నీ కంత బరువుగా వుంటే మేమే వచ్చి తీసుకెళ్ళేవాళ్ళం గదట్రా "

"మీ రెంతకూ రాకపోయేప్పటికి నీ కూతుర్ని నేనే పంపించాను " నిర్లక్ష్యంగా సిగరెట్టు పొగ వదులుతూ చెప్పాడు

"నీకు యిచ్చి పెళ్లి చేసిన రోజు నుండి ముందు అది నీ పెళ్లాం, తర్వాత నా కూతురు" అంది రాజమ్మ

మంచం మీద పడుకుని వున్న బుజ్జిగాడు కాళ్ళు చేతులు కదిలిస్తూ నవ్వుతున్నాడు చంద్రం సమాధానం చెప్పకుండా మౌనంగా కూర్చున్నాడు

"కట్నం పిచ్చి నీకుకూడా పట్టుకుందన్న మాట "

"ఏం ! నేను నీ రెండో అల్లుడికంటే ఎందులో తీసిపోయాను ? అతను బియ్యేస్సీ పాస్ కాలేదు నేను ఎమ్మే అతనికి యింకా వుద్యోగం కూడా లేదు నాకు వుద్యోగం వుంది అతనికంటే హీనంగా నన్నెందుకు చూస్తున్నట్టు ?"

తమ్ముడి వాదానికి నవ్వాలో ఏడ్వాలో అర్థం కాలేదు తమ కుటుంబ పరిస్థితి క్షుణ్ణంగా తెలిసి వుండి కూడా విచిత్ర ధోరణిలో మాట్లాడుతున్న తమ్ముడికి వున్న డబ్బాశ రాజమ్మకు స్పష్టంగా అర్థమయింది

"తమ్ముడూ ! రెండో అల్లుడితో వంతు పెట్టుకుంటే ఎలారా ? పరాయి సంబంధం కాబట్టి కట్నం యిచ్చుకోక తప్పలేదురా మా పరిస్థితి నీకు తెలియంది కాదుగదరా వున్నపళంగా నాలుగు వేలు తెచ్చి యివ్వమంటే ఎక్కణ్ణుంచి తెచ్చివ్వన్రా" అంది దీనంగా కళ్ళనీళ్ళు తెచ్చుకుని

"నన్నడిగితే నేనేం చెప్పేది? చూస్తే అందర్నీ సమానంగా చూడాలి ఈ పక్షపాతపు బుద్ధులు చూపించి నలుగురిలో నన్ను తలెత్తుకు తిరగకుండా చేశావు "

"నేను నిన్ను తలెత్తుకు తిరగకుండా చేశానా?" ఆశ్చర్యంగా అంది రాజమ్మ

"నువ్వు చేతకాని దద్దమ్మవు కాబట్టే మీ అక్క నీ చెవులకు తాటాకులు కట్టింది అవతల రెండో అల్లుడికి నాలుగు వేలు రొక్కం యిచ్చింది నీకు చిల్లి గవ్వ యివ్వకుండా కూతుర్ని అంటగట్టి పబ్బం గడుపుకుంది అని పదిమంది పది మాటలు అంటుంటే నా తలెక్కడ పెట్టుకోవాలి ?"

"ఎందుకురా ఈ డొంకతిరుగుడు కథలల్లి నిన్ను నువ్వు మోసపుచ్చుకుని నన్ను మభ్యపెట్టాలని చూస్తావు ? నలుగురిలో తలెత్తుకు తిరగలేక పోతున్నావా ? కానీ కట్నం లేకుండా రాధను చేసుకుని మా కుటుంబాన్ని రక్షించినందుకు నలుగురూ నిన్ను హర్షిస్తారు గాని నీ పరువు తీయర్రా ! కట్నం కావాలని మాటిగా చెప్పే ధైర్యం లేక నీ వుక్రోషమంతా అభం శుభం తెలీని రాధమీద తీర్చుకుంటావుట్రా? ఎమ్మే చదువుకున్నావట ఎమ్మే! చదువూ సంస్కారం వున్నవాడు చెయ్యాల్సిన పనట్రా యిది ? కట్నం కావాలని సూటిగా నన్ను అడుగు పాపం అమాయకురాలు దాన్ని హింసించడానికి నీకు మనసెలా వొప్పిందిరా ?" మనసులో సుడులు తిరుగుతున్న ఆవేదనంతా వెలుపలికి నెట్టింది

"అవును నాకు కావాల్సింది కట్నం దాన్తో పాటు రాధను పంపించు అందాక రాధను నీ దగ్గరే వుంచుకో " బిగ్గరగా అరిచాడు చంద్రం చేతిలో వున్న పుస్తకాన్ని విసురుగా గోడకేసి కొట్టి

"ఈ సంగతి ముందే చెపితే నే నింతసేపు యిక్కడ వుండేదాన్ని కాదు అనవసరంగా నీ కాలం వృథా అయ్యేది కాదు సరే నేను వెడుతున్నాను బుజ్జిగాణ్ణి కూడా తీసుకెడుతున్నాను రాధ కావాలనుకున్న రోజు నువ్వే నా దగ్గరికి రా" అంటూ బుజ్జిని తీసుకుని రాజమ్మ వెళ్ళిపోయింది

బ్రతిమాలి, ఎలాగైనా కట్నం డబ్బు యిస్తుందని ఆశపడ్డ చంద్రానికి తీరని నిరాశ మాత్రం మిగిలిపోయింది

రాజమ్మ యింటికి రాగానే, వెయ్యి కళ్ళతో తల్లి రాక కోసం ఎదురు చూస్తున్న రాధ అడిగిన మొదటి ప్రశ్న — మామయ్య ఏమన్నాడమ్మా ?

అసలు సంగతి చెపితే రాధ మరీ అధైర్య పడుతుందని బుజ్జిని అందిస్తూ "నా మాట వాడు కాదనడమ్మా యిప్పుడు శలవులు లేవట వారం పది రోజుల్లో వచ్చి తీసుకెడతా నన్నాడు" అంది తను చెప్పేది కల్తీ లేని అబద్ధమని అంతరాత్మ హెచ్చరిస్తున్నా

తల్లి అబద్ధం చెప్పదని రాధకు చిన్నప్పటి నుండి వున్న నమ్మకంవల్ల సంతృప్తి పడింది కూతురి కళ్ళలో చాలా రోజుల తర్వాత మెరిసిన తృప్తి చూసి 'పిచ్చితల్లి' అనుకుంది రాజమ్మ

సాయంత్రం చేని నుండి తిరిగి వచ్చిన రామినాయుడికి భార్య కనిపించగానే వెళ్ళిన పని ఏమయిందో తెలుసుకోవాలన్న వుబలాటం ఎక్కువయింది కాళ్ళు కడుక్కోకుండా ముందు ఆ సంగతే అడిగాడు

"ముందు మీరు భోజనం చెయ్యండి తిరిగ్గా అన్ని సంగతులు తర్వాత చెప్తాను" అంది రాజమ్మ

**జరిగిన కథ 2 : రాజమ్మ రామినాయుడుల**

ఆరుగురి సంతానంలో రాధ పెద్దది కట్నం యివ్వలేక రెండోపెళ్లి వాడైనా తమ్ముడు చంద్రంతో రాధ పెళ్లి జరిపిస్తుంది రాజమ్మ మరదలు శాంతకు నాలుగు వేలిచ్చి వివాహం చేయటం అవమానంగా భావించి తనకూ కట్నం తెమ్మని భార్యను పుట్టింటికి పంపేస్తాడు చంద్రం రాధ తనను ప్రేమగా చూసుకునే మామయ్య ఎలా మారిపోయాడో తలచుకుని బాధపడుతుంది

రాజమ్మ మొహంలో వెయ్యి ప్రశ్నార్థకాలను చూసిన నాయుడు మౌనంగా పీటమీద కూర్చు న్నాడు. ముక్తసరిగా భోజనం ముగించి మంచంమీద కూర్చుని పొగాకుకాడ ఈనెలు తీయసాగాడు.

"తమ్ముడేమంటున్నాడు?" పొగాకుకాడ వాసన చూస్తూ అన్నాడు.

"కొత్తగా అనేదేముంది? మొన్నటిదాకా రాధతో అన్నదే అన్నాడు. కట్నం బాపతు నాలుగు వేలు యిచ్చితీరాలట. ఏమన్నా అంటే మీ రెండో అల్లుడి కంటే నేను ఎందులో తక్కువ అని పొంతులు పెట్టుకుంటున్నాడు. ఎంత చెప్పినా వినుకోవడంలేదు. చదవేస్తే వున్న మతి కాస్తా పోయిందన్నట్టు..." అంది రాజమ్మ నెమ్మదిగా, ప్రక్క గదిలో వున్న రాధకు వినిపించకూడదని.

"నాకు మొదటినుండి అనుమానంగానే వుంది. నేను నీకు ఆనాడే చెప్పాను. శాంతకు నాలుగు వేలు యిస్తే చంద్రం వూరుకోడే అని నీకు అప్పుడే చెప్పాను. నా తమ్ముడు అలాంటివాడు కాదు, ఈ కట్నం గురించి వాడసలు పట్టించుకోడు అని చెప్పావు. చివరికి యిలా తయారయింది. నా మాట విని ఆ పామ్రురు కుర్రాడిని కుదుర్చుకుని వుంటే దమ్మిడీ యిచ్చేపని వుండేది కాదు. మనకు యివాళ ఈ గొడవ వుండేది కాదు." చుట్ట ముట్టిస్తూ అన్నాడు నాయుడు.

"ఏమిటండీ మీరు అనేది? ఆ రెండో పెళ్లి వాడికి రత్నం లాంటి శాంతను యిచ్చి చేసి చేజేతులా దాని జీవితం నాశనం చేసి వుండాల్సిందంటారా?"

"యిప్పుడు నువ్వు చేసిందేమిటి? రెండో కూతురి కాపరం చక్కబెట్టాలని ప్రయత్నం చేసి పెద్ద కూతురి కాపరాన్ని వీధి కెక్కించావు. మనం కట్నాలు యిచ్చుకోలేని స్థితిలో వున్నప్పుడు పిల్లల్ని ఏ అయ్య చేతిలోనో పెడితే పోయేది. శాంతకు యిచ్చినంత యివాళ చంద్రం యిమ్మంటున్నాడు. రేపు లక్ష్మికి, జానకికి, లలితకు కూడా అంతే యిచ్చు కోవాలి. ఎక్కణ్ణుంచి తెద్దాం? యిల్లు తాకట్టు పెట్టాం. వున్న నాలుగెకరాలు ఈ పెళ్లిళ్ళకు సరి పోతాయా? ఈ కట్నాలు మనం యిచ్చుకోగలమా? పిల్లల పెళ్లిళ్ళు చెయ్యగలమా? సవ్యంగా బ్రత గ్గలమా?"

నోట్లో చీరెకొంగు కుక్కుకుని తలిదండ్రుల మాటలు వింటున్న రాధకు ఏడుపు ఆపుకోవడం చాలా కష్టమయింది.

"కాస్త నెమ్మదిగా మాట్లాడండి. రాధ వింటుంది. బాధ పడుతుంది. అసలు సంగతి నేను దాని కింకా చెప్పలేదు. నెలలు నిండిన మనిషి తట్టుకోలేదని ఏదో చెప్పాను. మీరుకూడా అన కండి. నా తల్లి తల్లడిల్లిపోతుంది." గొంతు చివరి వరకు దు ఖంలో మునిగివున్న రాధకు ఆ సమయంలో నిర్లిప్తత నిండిన నవ్వు పెదాల చివర కదిలింది. పక్కలో బుజ్జి నోట్లో వేలు పెట్టుకుని తనకేమీ పట్టనట్టు ప్రశాంతంగా నిద్రపోతున్నాడు. పసిపిల్ల లకు దిగులు, విచారం అంటే ఏమిటో తెలీదు. అందుకే వాళ్ళు నిజంగా అదృష్టవంతులు అనిపిం చిం ి. అమ్మ, నాన్న సంభాషణ పొలాలు వర్షం ఎరువులు అప్పులమీదికి మళ్ళింది. సన్నగా విని పిస్తున్న మాటలు బాగా పొద్దుపోయాక ఆగి పోయాయి. చేతో చెంపలమీది కన్నీరు తుడుచు కుంది రాధ. నిశ్చలంగా నిద్రిస్తున్న బుజ్జి చెంపలు నిమిరి నుదుట నెమ్మదిగా ముద్దు పెట్టుకుంది. కళ్ళు మూసుకుంటే క్రితం రోజు మధ్యాహ్నం సరస్వతి యింట్లో జరిగిన సంఘటన అలలా కది లింది.

సత్యనారాయణ వ్రతం చేస్తున్నాం రమ్మని సరస్వతి రమ్మంటే తను వెళ్ళింది. వసారాలో నిల బడ్డ తనకు లోపలి గదిలో మాటలు వినిపించాయి.

"కట్నం యివ్వలేదని రాధ మొగుడు దాన్ని తన్ని పుట్టింటికి తరిమాడటగా! అయినా దీని కెక్కడ బుద్ధి లేదమ్మా? మొగుడు పొమ్మనగానే పోవడమేనా? ఇంతకూ తలిదండ్రులకు బుద్ధి వుండాలమ్మా! రెండో కూతురికి యిచ్చినట్టు ఆ కట్నం పెద్ద అల్లుడి మొహాన కూడా పారేయ కూడదూ? మా నాన్నగా రలా చెయ్యలేదమ్మోయ్! నా కెంత యిచ్చారో మా యిద్దరి అక్కలకూ కూడా యిచ్చారు."

"ఇహ యిదేం కాపరం చేస్తుంది? వాడక్కడ యిది యిక్కడ."

"కడుపటగా? ఇవాళ రేపట్లో కంటుం దేమో?"

తన స్నేహితు లనుకుంటున్న వాళ్ళంతా తన పరోక్షంలో అంత హీనంగా మాట్లాడుకుంటుంటే రాధ సహించలేక పోయింది. అందరికీ గట్టిగా చీవాట్లు పెడదామనుకుంది. అనవసరంగా రభస చేసుకోవడం తప్ప మరో ప్రయోజనం వుండదని పించి వెనక్కు తిరిగి వడి వడిగా నడుచుకుంటూ యింటికి వచ్చింది. నిన్నంతా వాళ్ళ మాటలు తూటాల్లా గుండెను తొలుస్తుంటే అమ్మ రాక కోసం ఎదురు చూస్తూ మర్చిపోయింది. శలవు దొరగ్గానే మామయ్య వస్తాడని తనతో చెప్పిన అమ్మ, నాన్నకు నిజం చెప్పింది.

రాధ లేచి కూర్చుంది. మామయ్య సంగతి తనకు బాగా తెలుసు. మనిషి చూడ్డానికి ఎంత మెత్తగా వుంటాడో అంత మొండి మనిషి. తన నెన్ని కష్టాలు పెట్టాడు! ఎన్నిసార్లు కొట్టాడు! గొడ్డుకంటే హీనంగా చూశాడు. అన్నీ సహించింది. తలిదండ్రులు కట్నం యివ్వలేదన్న కోపాన్నంత తన మీద కసిగా తీర్చుకున్నాడు. చెప్పి ప్రయోజనం వుండదని తనెప్పుడు యింటికి వుత్తరం కూడా వ్రాయలేదు. అమ్మ నాన్న కట్నం డబ్బు యివ్వలేనంత కాలం మామయ్య తనను తీసుకెళ్ళడు. మామయ్య తీసుకెళ్ళనంత కాలం వూళ్ళోవాళ్ళు మాటలతో తనను చిత్రవధ చేస్తూ వుండడం మానరు. తన మూలంగా అమ్మ, నాన్న బాధ పడతారు. మండే కుంపటిలా తను వచ్చి వీళ్ళ నెత్తిన కూర్చుంది. ఎంత కాలమని తనను భరించగలరు? అసలే అర్థి కంగా నలిగిపోతున్న సంసారం. పైగా తనూ, బుజ్జి. యింకో నాలుగు రోజులైతే తను ప్రసవిస్తుంది. పురుడు పోయాలి. మళ్ళీ ఖర్చు. దెబ్బమీద దెబ్బ. తట్టుకోలేరు. దీర్ఘంగా శ్వాస విడిచి పళ్ళతో పెదాలు బిగబట్టి రాధ లేచింది. దగ్గరకు వేసివున్న



తలుపులు నెట్టుకుని పెరట్లోకి వెళ్ళింది.

అరటి చెట్టు సందుల్లోంచి నిండు చంద్రుడు పాల నురగలా తెల్లగా కనిపిస్తున్నాడు. పొగడ చెట్టు క్రింద రాలిన పొగడ పూలు కుప్పగా పడివున్నాయి. అటూ యిటూ చూసి భావి వద్దకు వచ్చింది. కాలు తగిలి బొక్కెన చప్పుడయింది. భావి అంచు పట్టుకుని ముందుకు వొంగిన రాధ వీపున రెండు చేతులు పడ్డాయి.

"అమ్మా!" అంది రాధ తల్లిని గట్టిగా చుట్టుకుని.

"ఎంత అఘాయిత్యానికి పాల్పడ్డావమ్మా!" అంది రాజమ్మ కూతురు మొహంలో మొహం పెట్టి బిగ్గరగా ఏడుస్తూ.

"యింతకాలం మిమ్మల్ని ఏడ్పించింది చాలమ్మా. ఇంకా మిమ్మల్ని బాధ పెట్టలేనమ్మా."

"వూరుకో రాధా! నువ్వేం చేశావమ్మా? మన ప్రారబ్దం బాగోలేక యిలా జరిగింది. సమయానికి నాకు మెలకువ రాబట్టి సరిపోయింది గాని లేకపోతే యింకేముంది?"

"ముందు లోపలికి పదండి. నలుగురూ వింటే నవ్విపోతారు" అంటూ నాయుడు తల్లీ కూతుళ్లను లోపలికి తీసుకెళ్ళాడు.

మరెప్పుడూ ఆత్మహత్యా ప్రయత్నానికి పూనుకోనని రాధ తల్లికి ప్రమాణంచేసి చెప్పేవరకు రాజమ్మ కూతుర్ని విడిచిపెట్టలేదు.

## చెయి జారిన స్వర్గం

అప్పట్నుంచి రాజమ్మ కూతుర్ని ఎప్పుడూ ఒంటరిగా వొదిలిపెట్టలేదు. ఎప్పుడూ ఎవరో ఒకరు రాధతో వుండేవారు.

మిమ్మల్ని ఏడ్పించి చంపడానికి పుట్టిన నాకు చావెలా వస్తుందమ్మా అనుకునేది రాధ అప్పుడప్పుడు. ఎప్పుడూ ఒంటరిగా కూర్చుని ఆలోచిస్తున్న రాధను చూస్తున్న రాజమ్మ గుండె చెరువయింది.

పుట్టింటికి వచ్చినప్పట్నుంచి రాధ నెలకు నాలుగు ఉత్తరాలు చొప్పున చంద్రానికి యిరవై వుత్తరాలు వ్రాసింది. చంద్రం జవాబు చాలా క్లుప్తంగా టెలిగ్రాంలా వుండేది. బుజ్జి గురించి రెండు వాక్యాలు, మిగతా ఆరు వాక్యాలు కట్నం గురించి.



తన సంసారం విచ్ఛిన్నమైనదన్న మానసిక వ్యథతో రాధ ఆరోగ్యం బాగా దెబ్బతింది. దీనికి తోడు ఆమె తలిదండ్రులు సరయిన మందులు యిప్పించలేని స్థితిలో వుండడంచేత రాధ చాలా సన్నగా చీపురుపుల్లలా అయింది. పుట్టబోయే బిడ్డ గురించి రాధ సీరియస్‌గా ఆలోచించలేదు. తన బ్రతుకే దుర్భరంగా వున్న తరుణంలో మరో ప్రాణి ఎందుకు అనే విరక్తభావం మొదటినుండి గర్భంలో వున్న బిడ్డతోపాటు పెరుగుతుండడం వల్ల పుట్టిన బిడ్డ రెండోనాడే చనిపోయింది. రాధ అంతగా బాధపడలేదు. ఒకవిధంగా తనకు మేలే జరిగిందని వూరటపడింది. బిడ్డ పుట్టాక రాధ ఆరోగ్యం మరీ క్షీణించింది. చంద్రంకోసం ఎదురు చూసిన రాధకు ఎదురుచూడని నిరాశ రాసిలా మిగిలిపోయింది.

కూతురి పరిస్థితి చూసిన రాజమ్మ అభిమానం విడిచి మళ్లీ తమ్ముడి వద్దకు వెళ్లింది.

కాళ్లా వేళ్లా బ్రతిమాలి "అది నీకోసం ఆశగా వెయ్యికళ్లతో ఎదురు చూస్తోందిరా! దాని ఆశను నిరాశ చెయ్యకురా ఒక్కసారి వచ్చి దాన్ని చూసిపోరా! దాని ఆరోగ్యం అసలు చెడిపోయింది బిడ్డ పుట్టాక" అంటూ చేతులు పట్టుకుంది.

చిన్నతనం నుండి తనను పెంచిన అక్క — ఎప్పుడూ అంత దీనంగా బ్రతిమాలని అక్క అలా బ్రతిమాలుతుంటే చంద్రంలో యింకా మిణుకు మిణుకు మని కొట్టుమిట్టాడుతున్న మానవత్వం ఒక లిప్తపాటు రెపరెప లాడింది. కానీ పట్టుదల ముందు అది ఆరిపోక తప్పలేదు.

(ఇంకా వుంది)

రైతుబిడ్డగా పుట్టి, సినిమా గడ్డపై కాలూని, అప్పుడు, ఇప్పుడు, ఎప్పుడూ నిత్య యవ్వనుడిగా, నటసామ్రాట్‌గా విరాజిల్లుతున్నారు అక్కినేని అనడం అతిశయోక్తి కాదనుకుంటాను. సాధారణంగా వయసు పెరిగేకొద్దీ, వర్చస్సు తగ్గిపోవడం జరుగుతుంటుంది. కానీ అక్కినేనికి వయస్సు ముదిరేకొద్దీ ముఖం ముద్దు ముద్దుగా తయారౌతోంది. క్రొత్త అందాలు ఆకృతిలో కన్పిస్తే, కొంగ్రొత్త చందాన నాగేశ్వరరావు నటించడం జరుగుతోంది. ముప్పది వత్సరాలు ఒక వ్యక్తి హీరోగా నటించి, నలుగురికి నచ్చడమంటే మాటలా ? ఆ స్థాయిని చేరుకోవడానికి అతనెంత కృషి చేసివుండాలి ? ఒక మనిషి గొప్పవాడు కావాలంటే, ఎన్నో విపత్తులకు, ఎన్నో విమర్శలకు గురికావాల్సి వస్తుంది. విమర్శనలను నవ్వుతో స్వీకరించి, పొగడ్తలకు పొంగిపోక, ముఖస్తుతికి లొంగిపోకవున్న కారణంగానే మూడు పదులు నిండినా, హీరోగానే చలామణి అవుతున్నారు అక్కినేని. ముక్కుకు సూటిగాపోయే మనిషి. ఉన్న మాటను, తానమకున్న మాటను ముఖంమీదనే చెప్పేసే రకం. నిజానికి అతను నిగర్వి. నటనలో తానెంత నిష్ణాతుడైనా, నేర్చుకోవలసింది ఇంకా ఎంతో వుంది అని నవ్వుతూనే చెప్పే తత్వం ఆయనది. క్రమశిక్షణ అంటే చెవ్వు కోసుకుంటారు. కాల్‌షీట్ 9 గం.లకు అంటే, 8–30 గం.లకల్లా సెట్లో వుంటారు అక్కినేని. ఆ శిక్షణ, ఆ పాటింపువల్లనే ఇంతవాడయ్యారు. అనవసర ప్రసంగాల్లో జోక్యం చేసుకోరు. అధిక ప్రసంగం చేయడం అలవాటు లేదు. పరిశ్రమలో అడుగిడిననాటినుంచి, నేటివరకు ఆయన ప్రవర్తనలో మార్పులేదు. సెట్లో కూర్చొంటే షూటింగుకు ముందు అందరితో కల్సి పిచ్చాపాటీ మాట్లాడుతూ, వార్ని జోక్స్‌తో నవ్వించడం వారికొక సరదా. తోటి నటీనటులను గౌరవించడం, ఇలా చేస్తే బాగుంటుంది, అలావుంటే బాగుంటుంది అని అనుభవం తక్కువ అయినవారికి సలహాల నివ్వడం, వారిని సవరించడం తమ ధర్మంగా భావిస్తారు నాగేశ్వరరావు. దర్శకుడు, నటీనటుల మధ్య సర్దుబాటు వున్నపుడే చిత్రం సరిగ్గా వస్తుందని నమ్మేవారిలో అక్కినేని ప్రథముడు. దర్శకుడనే పదానికి, పదవికి ఎప్పుడూ తన స్వంత భావాలతో అడ్డు కల్గించరు. తన భావం, దర్శకుని భావం ఏకీభవిస్తేనే తనమకున్న ప్రకారం చేస్తారేగానీ, అలా ఏకీభవించనపుడు తన ఆధిక్యతను ప్రదర్శించరు. అందుకే అతనితో నటించడానికి అతని చిత్రాలను దర్శకత్వం చేయడానికి ఉత్సాహంతో వురకలేస్తుంటారు ఎందరో వ్యక్తులు.

అక్కినేని చిత్రాన్ని పంపిణీ చేయాలంటే ఎన్నో పంపిణీ సంస్థలు తమ మద్దత్తుకు సమ్మతిస్తాయి. అతని చిత్రానికి వచ్చే వసూళ్ళ అందరి చిత్రాలకన్నా ఎక్కువే. అందుకే ఎగ్జిబిటర్లు నాగేశ్వరరావు చిత్రాలను రిజర్వు చేసుకోవడానికి కూడా వెనుకాడరు.

### అక్కినేని - సాంఘిక పాత్రలు !

నాగేశ్వరరావు సాంఘిక పాత్రలనే చేయుగలరు అని అపోహపడేవారు ఇకపై అలాంటి అభిప్రాయాన్ని మార్చుకోవచ్చు. అసలు అక్కినేని సినిమా జీవితం పౌరాణిక పాత్రతోనే ఆరంభమైంది. తర్వాత సాంఘిక పాత్రలను చేపట్టారు. కొంత కాలం జానపద చిత్రాల్లో నటించారు. "విప్రనారాయణ", "భక్త జయదేవ", "కాళిదాసు" లాంటి



భక్తిప్రదమైన చిత్రాల్లో నటించి రక్తికట్టించారు. "దేవదాసు", "బాటసారి", "అనార్కలి", "లైలా—మజ్నూ", "వెలుగు నీడలు", తోడికోడళ్లు", "మాంగల్యబలం" లాంటి ఎన్నో సాంఘిక చిత్రాల్లో నటించి, మెప్పించారు. తన ఆకారం, తన వాక్పరిమాణం, మున్నగువాటిని గుర్తించుకొని సాంఘిక చిత్రాల పాత్రలకైతే తాను సరిపోతానని దృఢనిశ్చయం తన మనోఫలకంలో మెరిసిన తర్వాత, అతని అభిమానులు, అతన్ని ఆశీర్వదించేవారలు అతన్ని అలాంటి చిత్రాల్లోనే చూడడానికి ఇష్టపడుతున్నట్లు అతనికి తెలియచేసిన పిదపనే వారు సాంఘిక చిత్రాల్లోనే నటిస్తూ వచ్చారు.

*   *   *

"ప్రేమనగర్", "విచిత్రబంధం", "డాక్టర్ చక్రవర్తి" లాంటి ఎన్నో నవలా చిత్రాల్లో నాయకుడి పాత్రను పోషించి, నవలలలోని ఆ పాత్రలను తనకోసమే సృష్టించారా అనేట్లు నటించి నివాళు లందుకున్నారు.

### కథలు బాగులేవు

ఇటీవల అక్కినేనిగారు నటిస్తున్న చిత్రాల్లో కథ సరిగ్గా వుండడంలేదు, వారి పాత్ర ప్రాధాన్యత అంతగా కన్పడడంలేదు, వారెందుకలా సారంలేని, సమాచారం అందించలేని చిత్రాల్లో నటిస్తున్నారో అర్థం కావడంలేదని ప్రశ్నలవర్షం కురిపిస్తున్నారు అభిమానులెందరో. వారడిగినదాంట్లో నిజం లేకపోలేదు. ప్రేక్షకుల అభీష్టానుసారమే పాత్ర పోషణ జరపాలని తలచేవారిలో అక్కినేని ఒకరు. కానీ జనావళి కూడా నటీనటుల సమస్యలను అర్థం చేసుకోవాలి. "నేను ఇలాంటి పాత్రలైతేనే చేస్తాను, మీారు చిత్రించే పాత్రలను చేయను అని నిక్కచ్చిగా చెప్పడం అంత సులభంకాదు. అలాగే మీారు సృష్టించే పాత్రలు ప్రేక్షకుల ప్రేమకు పాత్రమయ్యేవిగా వుండాలని నిర్మాతలకు చెప్పడానికి వెనుకాడకూడదు.

ఇటు నిర్మాతకు నష్టం రాకుండా, అటు ప్రేక్షకులకు తమపై అయిష్టం కలగకుండా నడచుకోవడమే నాకు అలవాటు అంటారు నటసామ్రాట్.

### పరిమితం !

ఇకపై వారు సంవత్సరానికి నటించే చిత్రాలు మూడుకుపైన వుండవు. అవికూడా వెరైటీ

(31వ పేజీ చూడండి)



అమెరికా విదేశాంగమంత్రి హెన్రీ ఏ. కిసింజర్ సతీమణి అక్టోబర్ 29న ఆగ్రాలోని తాజ్‌మహల్‌ను సందర్శించారు.

# గృహవిక్రయం



ఎలాగయితేనేం శ్రీహరి సాధించాడు; వాళ్ల అమ్మచేత 'ఊఁ' అనిపించాడు సొంత ఊళ్లో ఉన్న వాళ్లఇల్లు అయిన కాడికి అమ్మివెయ్యటానికి!

'పోనీ మీరేచెప్పండి; సుగుణ, లక్ష్మి పెద్దవాళ్లవుతున్నారా! మీరి ఉద్యోగం చేస్తూ వాళ్లకి చెవులకు రింగులయినా చేయించగలిగారా? ... పోనీ అది ఎదిలేద్దాం. కనీసం చేసిన అప్పు తీర్చే త్రోవ లేదాయె! ... తిరిగి మనం ఆ వూరికి వెళ్లేదా యేమన్నానా, అక్కడ ఆఇల్లుఎందుకుచెప్పండి?' ఇదీ అర్ధాంగి రమ వాదన.

నిజమే, అప్పుడప్పుడు చేస్తూ వచ్చిన అప్పు వడ్డీ పోసుకుని రెండు వేలదాక అయి కూర్చుంది. తీర్చాలి. తీరిస్తే హాయిగా ఊపిరి పీల్చుకోవచ్చు అన్న తపన వున్నా, దౌర్భాగ్యం అది తీరే అదృష్టం మాత్రం లభ్యం కాడంలేదు.

"ఇదిగో అబ్బాయి! నువ్వు ఎన్నయినా చెప్పుగాని స్వగ్రామంలో కొంప కాస్తా అమ్మేస్తామంటే గుండె ఝల్లుమంటూంది రా! ... మిగిలిందదే మీ తాతలనాటి ఆస్తి ... ఈ పిల్లలను విడిచిపెట్టి ఉండలేక గాని, లేకపోతే అక్కడకే వెళ్లి నా అన్న కొంపలో యింత ఉడకేసుకుని తింటే ఆ ఆనందమే వేరు ... ఈ వుద్యోగం అయ్యాక అప్పుడయినా కోడలుతో వెళ్లి సలక్షణంగా ఆ యింట్లో వుంటావని యిన్నాళ్లూ ఆశ పడుతూ వచ్చాను" అంటుంది అమ్మ.

"ఇంకో యిరవైయేళ్ల తరువాత మాట అది! అప్పటికి ఆ యిల్లు కూలుతుందో యేమోకూడ ... చూడమ్మా! మనం ఆ వూరు విడిచిపెట్టే పదిహేనేళ్లు దాటి పోయిందికదా. అసలు ఇప్పటికే ఆ యిల్లు ఎటువంటి స్థితిలో ఉందో! తీరా ఆ కొంప శిధిలావస్థకు వస్తే ఆఖరకు కొనేవాడుకూడ ఉండడు; ఆఁ!"

ఎలాగో చెప్పి అమ్మను ఒప్పించేటప్పటికి తలప్రాణం తోకకు వచ్చిందన్నా అతిశయోక్తి కాదు.

పదిహేనేళ్ల అనంతరం తిరిగి యివాళ

తను పుట్టిన ఊరుకు బయలుదేరాడు బస్సులో శ్రీహరి. ఆరు ఏడు గంటల ప్రయాణం.

ఆ ఊరు మాట వచ్చిందంటే చాలు మాష్టారు, కమల స్మృతిలోకి వచ్చారన్న మాటే! ఆ మాష్టారి చలవ వల్లనే తను యింత చదువుకుని యీపాటి ఉద్యోగమయినా చేయగలుగుతూంట. ఆఖవ క్లాసులో చేర డానికి టెస్టు పెడితే మాష్టారి ప్రోత్సాహంతో తన సహాధ్యాయులతో తనూ వెళ్లి వ్రాసివచ్చాడు. టెస్టులో పాసయ్యాడు. తీరా ఫీజు కట్టమనేసరికి నాన్నగారు ససేమిరా యీ యింగ్లీషు చదువులు చదివించను పొమ్మన్నారు. కడకు మాష్టారు వచ్చి నాన్న గారికి నచ్చచెప్పజూసారు. కాని ప్రయోజనం లేకపోయింది. అప్పుడు మాష్టారే అప్పటికి ఆ రెండు రూపాయల పావలా కట్టి, నెమ్మది మీద నాన్నగారిచేత తరువాత 'ఊ' కొట్టించారు.

తనూ, శంకరం, నారాయణ రోజూ రాత్రిళ్లు పెందరాళే భోజనం చేసి అద్దాల లాంతర్లు, పుస్తకాలు, పలకలూ తీసుకుని మాష్టారి యింటికి చదువుకోడానికి వెళ్లే వారు. వీధి అరుగుమీద చదువు... మాష్టారి మాటలు కొన్ని తనకు యిప్పటికీ జ్ఞాపకమే!

"'ఎలిఫెంట్' స్పెల్లింగు చెప్పరా?" నారాయణను అడిగేవారు.

వాడేమో "ఇ. ఎల్. ఓ..." అంటూండగానే మాష్టారు అందుకుని "...పి. క్యూ ఆర్... ఎక్స్. వై. జడ్. వెధవాయ!" అంటూ మొట్టికాయ మొట్టేవారు.

"హౌ ఓల్డు ఆర్ యు?" అంటూ తనను అడిగేవారు.

"ఐ ఆర్..."

"ఐ ఆర్ కాదు, నా శ్రాద్ధం, నా పిండా కూడూ... ఎన్నిసార్లు చెప్పాలి 'ఐ' తరువాత 'ఆర్' రాదని 'ఏమ్' మాత్రమే వస్తుందని"

ఇంక లెక్కలలో తప్పు చేసినా, తప్పు చెప్పినా "ఇది లెక్కలు పెడతాయ! గోంగూర పచ్చడి, నేతి గారెలూ అనుకున్నావా యేమిటి యెగపడి మెక్కటానికి!" అనేవారు.

చెప్పి చెప్పి విసిగిపోతే "ఈసారి సరిగా చెయ్యకపోయావో, చెవులు కాస్త మెలితిప్పి చేతిలో పెడతానంతే!" అంటూ కళ్లెర్ర చేసేవారు.

శంకరం నారాయణను ఒకసారి కొట్ట బోతుంటే చూసి అన్నారు "బడితెపూజ కావాలేమిట్రా?" అని.

**దీపావళి కథల పోటీలో**
**రు. 750 లు**
**బహుమతి పొందిన కథ**

థర్డుఫారంలో తను స్కూల్‌కి ఫస్టుగా వచ్చినప్పుడు విని మాష్టారు ఎంతో పొంగి పోతూ "నా శిష్యుడి ఈ విజయం యివాళ నాకు గర్వకారణం అయింది ... ఇది నేను వేసిన ఫౌండేషనే! ... ఆ సేమ్యా పాయసం అయిందేమో ముందు హరికి ఓ గ్లాసుడు త్రాగించు" అన్నారు అత్తయ్యగారితో.

ఆనంద భాష్పాలను ఆయన తువ్వాలు కొసతో తుడుచుకోటం తనకు యిప్పటికీ కళ్లకు కట్టినట్లుగానే జ్ఞాపకం ఉంది.

అవునుమరి, ఆయన వేసిన ఫౌండేషనే! అది అక్షరాల నిజమే!

"బ్రతికిన రోజుల్లో తాలూకా ఆఫీసు గుమస్తాను బాబూ! చేయని నేరం నామీదకు నెట్టబడి నా ఉద్యోగమే పోయింది. నేనే దరిద్రుడినయితే, అర్ధరాత్రి యింట్లో చొరబడిన దొంగలు సమస్తం దోచుకు పోతూ, లేచి కేకలువెయ్యబోయిన నా రెండు కళ్లమీద ఇనపకడ్డీతో బాది మరీ వెళ్లి పోయారు. ఫలితం నాకీ అంధత్వం బాబూ! ... నేను ఈ యాచనకు దిగవలసి వచ్చింది కనుక, ఈ కథంతా చెప్పకుని మిమ్మల్ని నమ్మించే వ్యర్థప్రయత్నం చెయ్య వలసి వస్తూంది...బ్రతుకుతున్నాను, చచ్చి... చావు వచ్చేదాక యీ కడుపు నింపుకోడం కోసమీ యాతన ... నన్ను కనికరించండి బాబూ!"

తన ఆలోచనలకు ఈ మాటలతో అంతరాయం కలిగింది. బస్సు తాడేపల్లిగూడెం వచ్చింది. జీవన భృతికోసం యీ అవసాన దశలో పోరాటం సాగిస్తూన్న ఆ వృద్ధుడ్ని చూస్తుంటే హృదయం ద్రవించింది. ఇలా రకరకాలయిన ఆఘాతాలు తిని నరకప్రాయమయిన జీవనాన్ని సామభూతిరహితంగా సాగిస్తున్నవాళ్లు ఎందరో! ఒక అర్ధ రూపాయి నాణెం తీసి ఆయన చేతిలో వుంచాడు.

తను యిప్పుడు వెడుతున్నది యిల్లు అమ్మటానికి. వెళ్లగానే అయేదా యిది? కొనటానికి ఎవరయినా ముందుకురావాలా? ఉన్నపళంగా అమ్మితామంటే ఎక్కువ డబ్బు రాదేమోకూడ. అంతా సవ్యంగా నడిస్తే రిజిస్ట్రేషనుకు ఒకరోజు పడుతుంది. అందుకనే యివన్నీ ఆలోచించే ఎందుకయినా మంచిదని ఆఫీసుకు ఒక వారంరోజులు సెలవుపెట్టి మరీవచ్చాడు ... ముందు గచ్చరుగుల పెంకుటిల్లు, మధ్యలో కాళీస్థలం, ఆ వెనక బంగాళాపెంకుల చావడి, ఆ వెనక కాళీ స్థలంలో అరడజను కొబ్బరిమొక్కలు, ఒక మావిడిమొక్క. చావడికీ, యింటికీ మధ్య స్థలంలో బత్తాయిచెట్టు, మాలతీపందిరి... ఎంతలేదన్నా పదివేలు కిమ్మత్తుచేసే యిల్లే మరి! అధమపక్షం ఎనిమిదివేలయినా రాక పోతుందా? వెధవది, బాకీదారు బజారులో ఎప్పుడు ఎదురుపడినా తలవంపుగా ఉంటూంది, వాడు వేసే ప్రశ్నలకు సమాధానం చెప్పలేక ... ముందు వాడికివ్వల్సిన రెండువేలు వాడి మొహాన కొడితేగాని తనకు మనశ్శాంతి వుండదు ... పిల్లలకు, రమకు శుభ్రమయిన బట్టలులేవు ... సుగుణ, లక్ష్మి తనను ఎన్నడూ యిది కావాలి, అది కావాలని మారాంచేసి ఎరుగరు. పాపం! వాళ్లకు ఏం ముచ్చట్లు తీరుస్తున్నాడుకనుక?... వాళ్లకు, రమకు, అమ్మకు, తనకు కనీసం రెండేసి జతలయినా బట్టలు తీసుకోవాలి. రమకో గాజులజత, పిల్లలకు జూకాలుకూడ చేయించేసి మిగిలిన డబ్బు ఏ ఫిక్సెడ్ డిపాజిట్‌గానో ఏ పోష్టాఫీసులోనో, బాంకులోనో వేసుకుంటే సుగుణ పెళ్లికి ఉపయోగిస్తుంది ... నవ్వుకున్నాడు అంతట్లోనే తెలుగులో ఏదో సామెత గుర్తుకువచ్చి.

తణుకు వచ్చింది. జామకాయ ఒకటి కొనుక్కొని తిన్నాడు. సిగరెట్ వెలిగించుకున్నాడు...ఈ సిగరెట్టొకటె, తనకు బాధలోనూ సుఖంలోనూ కూడ సన్నిహితంగా ఉంటుంది. రమ మానెయ్యమంటుంది... కాని ఆమెకేం తెల్సు తన బాధ!

జనం తోసుకుంటూ బస్సు ఎక్కుతున్నారు; కండక్టరు టిక్కట్లు ఇస్తున్నాడు.

ఒక యిరవై యేళ్ల కుర్రాడు జేబులో చెయ్యిపెట్టి గొల్లుమన్నాడు. "అయ్యో! నా పర్సు... నా పర్సు యెవరో కొట్టేసారండి... అందులో యిరవై రూపాయలున్నాయి" అంటూ, వెనక్కూ ముందుకూ చూసాడు. ఎవరూ అనుమానించవలసిన వాళ్లు కనిపించనట్లుంది. "మాది యీ ఊరు కాదు. ఇక్కడకు యింటర్వ్యూకి

(32 వ పేజీ చూడండి)






రేపు దీపావళి వస్తుందంట, యివాళ్టి వరకు ఏం చీరెలు కొన్నారో తనకు తెలియదు అని చెప్పింది, అగ్రనటి వాణిశ్రీ. అవును. నిజమే. వాళ్ల అక్కయ్య కాంతమ్మ ఏ చీరె కొని తెచ్చిందో, దానిని ధరించడం వాణిశ్రీకి అలవాటు. అక్కయ్యకి చెల్లెలంటే ప్రాణం. ఆమె మనసుకు నచ్చే పనులను చేయడం కాంతమ్మ స్పెషాలిటీ!

వెయ్యి రూపాయలు యిచ్చి విలువయిన చీరె కొంటే కష్టమంటుంది వాణిశ్రీ. కానీ వెయ్యికి టపాకాయలు కొనడానికి యిష్టపడుతుంది. గత ఏడు కొన్న చిచ్చుబుడ్లు యింకా వున్నాయి అన్న నిజాన్ని ఆమె బీరువా తెలియచేసింది. వెయ్యికి టపాకాయలు ఎన్ని వస్తాయో వాణిశ్రీకి తెలియదేమో!

దీపావళి రోజు కార్యక్రమం ఏమిటన: వేకువన నిద్ర లేవడం. తలంటు స్నానం చెయ్యడం. కొత్త గుడ్డలు ధరించడం. తన అక్కయ్యగారి చిరంజీవులకు తనే స్నానం చేయించి, వాళ్లకు తనే కొత్త డ్రస్సును అలంకరించడం.

తనుకూడా పదేండ్ల బాలిక చందాన పిల్లలతో బాటు టపాకాయలు, కాకర వత్తులు కాల్చడం. ఎక్కువగా ఆటంబాంబు పోలిన టపాకాయలను కాల్చడం యీమెకు సరదా.

ఉదయం పది గంటలకల్లా, శుభ్రంగా కోడి కూరను ఆరగించడం. వచ్చే అతిధులకు స్వాగతం చెప్పి, కూర రుచి చూపించి, ఒక్కొక్కరికి ఒక టపాకాయ పెట్టెను బహూకరించడం తప్పనిసరిగా జరిగే పని.

సాయంత్రం అయిదింటికల్లా, యింటిని విద్యుద్దీపాల వెలుగుతో దేవేంద్ర భవనంవలె సింగారించడం, ప్రమిదల కాంతులు నలువైపులా ప్రసరింప చెయ్యడం దీపావళి పర్వదినాన చెయ్యక తప్పుతుందా, అంటుంది ఆంధ్రుల ప్రియతమ నాయిక.

వాణిశ్రీకి దీపావళి, వినాయక చవితి పండగలను కోలాహలంగా జరుపుకోవడం అలవాటు అని ఆమె నోటంట చెప్పింది.

## * సినిమా విశేషాలు *

### బతుకే ఒక పండుగ

కిరణ్ ప్రొడక్షన్స్ ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మిస్తున్న చిత్రానికి యిడిన పేరు యిది. దీనికి పి. చంద్రశేఖరరెడ్డి దర్శకుడు. కథ, మాటలను సత్యానంద్ రాశాడు.

ప్రధాన పాత్రలను రాధిక, సత్యప్రియ, భవానీ పోషించారు. ముగ్గురూ కొత్తవాళ్లే అయినప్పటికీ, బాగా చేసినట్టు వార్త. హీరోగా ఆనంద్ ఆశాజనకంగా నటించారట. సహాయ పాత్రలను శ్రీధర్, చంద్రమోహన్, కె. వి. చలం, సూర్యకాంతం, రమాప్రభ ధరించారు.

కొత్తవాళ్లతో వర్ణ చిత్రం మూడుమాసాలలో ముగించిన నిర్మాతత్రయం పి. వి. రమణయ్య, వై. కిష్టవర్, హనుమంతరావు అభినందనీయులు.

### వంశీకృష్ణ ఫిలింస్!

ఇప్పటికి అయిదుగురు (మహిళలు) దర్శకులయ్యారు. ఈ విజయదశమినాడు జమున (ఆరవ మహిళ) దర్శకురాలైంది. ఈమె దర్శకత్వం నెరపుతున్న చిత్రం పేరు "డాక్టర్ అరుణ". ఈ కథను డి. కామేశ్వరీదేవి రాసింది. మాటలను దొరబాబు ఫేమ్ గోపీ వ్రాశాడు.

డాక్టర్ అరుణగా జమున నటిస్తున్న యీ చిత్రంలో రామకృష్ణ, గుమ్మడి, సత్యనారాయణ, ధూళిపాళ, మిక్కిలినేని, చంద్రమోహన్, కృష్ణకుమారి, శ్రీవిద్య, రమాప్రభ, శ్రీదేవి ప్రధాన తారాగణం.

సంగీతానికి చక్రవర్తి, ఛాయకు భాస్కరరావు, కూర్పుకు ఎమ్. ఎస్. మణి, కళకు భాస్కరరాజు, సహదర్శకత్వానికి రంగస్వామి బాధ్యత వహిస్తున్నారు. మన ప్రముఖ హీరోల్లో ఒకరు ముఖ్య పాత్ర పోక



"రామునిమించిన రాముడు"లో ఒక సన్నివేశం

### రామారావు

లక్ష్మి అంటే నటి లక్ష్మి అనుకునేరు. కాదు. కాదు. ఒక పంపిణీ సంస్థ పేరు. లక్ష్మి ఫిలింస్ ద్వారా విడుదలయ్యే చిత్రాలకు లక్ష్మి ప్రాప్తి ఎక్కువ అనే నిజం అందరికీ తెల్సిన విషయమే. ఆ పంపిణీ సంస్థ ద్వారా రామారావుగారి చిత్రం యింతవరకు రాని లోటును తీర్చే ఒక శుభ వార్త. "ఓ సీత కథ" నిర్మాతల్లో ఒకరైన అశ్వనీదత్ వైజయంతీ మూవీస్ పతాకం క్రింద నిర్మించే చిత్రం లక్ష్మి ఫిలింస్ పంపిణీ చేస్తోంది. బాపయ్య దర్శకత్వం వహించే ఈ చిత్రానికి భమిడిపాటి రచయిత. ప్రత్యేక పాత్రలో నటరత్న నాయకుడిగా నటించడమే విశేషం ఈ చిత్రంలో.







గ్లామర్ హీరో శోభన్‌బాబు, మంజుల, కృష్ణకుమారి, ధూళిపాళ పాల్గొన్నారు ముఖ్య పాత్రలను అంజలీదేవి, కాంతారావు, ప్రభాకరరెడ్డి, సాక్షి రంగారావు పోషిస్తున్నారు మహాకవి ఆత్రేయ విరచితమైన

''కలుసుకున్న తొలి రోజింకా
కన్నులలోనే వున్నదిరా
తెలిసో తెలియకో వలచిన మనసు
తలుపులు తెరిచే వున్నదిరా'' అనెడి సుశీల

పాడిన పాట కూడా మొదటి షెడ్యూలులో చోటు చేసుకుంది. ఈ చిత్రానికి మహదేవన్ సంగీతాన్ని, సత్యానంద్ రచనను, జి. వి. సుబ్బారావు కళను, కన్నప్ప ఛాయను నిర్వహిస్తున్నారు.

ఆంధ్రుల ప్రియతమ దర్శకుడిగా విరాజిల్లుతున్న ఆదుర్తి దర్శకత్వంలో ఆంధ్రుల అభిమాన నాయకుడు (శోభన్) మరింత రాణించగలడని ఆశిద్దాం. అన్నపూర్ణా విడుదల.



''బలిపీఠం''లో శోభన్‌బాబు, శారద

దానిని పోషించే యీ చిత్రానికి కె సి శేఖర్ నిర్మాత జోతీ పిక్చర్స్ విడుదల

జమునా రమణారావు మహామహులయిన దర్శకశ్రేష్ఠులందరివద్ద పని చేసియుండడంవల్ల, యీయన నుండి మంచి చిత్రం రావడానికి ఎక్కువ అవకాశం వున్నది

### చిన్నపరెడ్డి - కొత్త సంస్థ!

ఉషశ్రీ సంస్థకు స్వంతదారుడిగా వుండి ''పసిడిమనసులు, విచిత్ర దాంపత్యం, మానవుడు—దానవుడు'' చిత్రాలను నిర్మించి డబ్బును పేరును గడించారు చిన్నపరెడ్డి

కాలదోష మహాత్మ్య ఫలితంగా, కొంత నష్టం రాక తప్పిందికాదు రెడ్డికి విజయదశమి మరుదినం తన కొత్త చిత్రం రికార్డింగును ప్రారంభించారు సంస్థ పేరు శ్రీ మాధవీ ప్రొడక్షన్స్ అని చెప్పారు చిత్రం పేరు ''ప్రేమ—పగ'' కథ, సినిమా అనుకరణను చిన్నపరెడ్డి రాశారు మాటలను శ్రీకాంత్‌చేత వ్రాయించారు ఇతడు ఒక దిన పత్రికకు, విజయవాడ సినిమా మాస పత్రికకు సినిమా విలేఖరిగా పని చేస్తున్నారు ఎన్నో కథలను, కవితలను తెనిగించియున్నారు

''ప్రేమ—పగ'' చిత్రంలో రంగనాథ్, ప్రభ, చంద్రమోహన్, ధూళిపాళ, రావుగోపాలరావు, మంజుభార్గవి ముఖ్య తారాగణం సంగీతాన్ని అశ్వద్ధామ, ఛాయను సుకదేవ్, కూర్పును శీను, కళను కళాకర్ నిర్వహిస్తున్నారు. పి. సుబ్రమణ్యం దర్శకుడు ఈ సుబ్రమణ్యమే ''పసిడిమనసులు'' చిత్రానికి దర్శకత్వం నిర్వహించారు రెడ్డి—మణ్యం జంటకు మేలు కలుగుగాక!



### ఆర్థిక మంత్రి ఆరంభించిన చిత్రం

విజయదశమి పర్వదినంనాడు విజయభట్ మూవీస్‌వారి వర్ణ చిత్రం షూటింగు ఏ వి ఎమ్ స్టుడియోలో ఆరంభమైంది ఈ చిత్రానికి బీహార్ ఆర్థిక మంత్రి దరోగ ప్రసాద్‌రాయ్ విచ్చేసి షూటింగును ప్రారంభించారు ఏ వి ఎమ్ చెట్టియార్ క్లాప్ కొట్టారు ఈ చిత్రాన్ని పిలాచమియా నిర్మిస్తున్నారు

తొలి షెడ్యూలు అయిదు రోజులు జరిగింది

### బాబు చిత్రం విశిష్టత

మారుతీ ప్రొడక్షన్స్ నిర్మిస్తున్న ''బాబు'' వర్ణ చిత్రం గూర్చి నాకు తెలిసిన కొన్ని ప్రత్యేకతలను తెలుపుతున్నాను మొన్న మొన్నటి వరకు సహాయ దర్శకుడిగా వుండిన కె రాఘవేంద్రరావు దర్శకత్వం నిర్వహిస్తున్న ఫస్టు చిత్రం యిది కులువ్యాలీలో షూటింగు జరుపుకొన్న ఫస్టు చిత్రం యిది మైసూర్ మహారాజా పేలస్‌లో షూటింగు చేసుకొన్న ఫస్టు చిత్రం యిది షూటింగు నిమిత్తం ఒక స్పెషల్ కారుకు నోచుకున్న ఫస్టు చిత్రం యిది వాహిని ఎనిమిదవ ఫ్లోర్‌లో అతి రమణీయమైన హర్మ్యాన్ని సృష్టించుకొన్న ఫస్టు చిత్రం యిది వెండితెర యోధాను యోధు










ప్రపంచానికి రాబోయే రోజులు గడ్డు సమస్యలతో, బాధల గాథలతో నిండియుంటుందేమో నన్న భావాన్ని వూర్వశి శారద వ్యక్తపరిచింది!

దీపావళి కబుర్లు అడిగితే యిట్టి సమాధానం యిస్తారేమిటి అని ఆమెను ప్రశ్నించాము

"ఆపేరెత్తకండి భయం వేస్తోంది నరకాసురుడు మళ్ళీ అవతరించాడా? అనిపిస్తున్నది ధరల రూపంలో అతడి వికటాట్ట హాసం వినిపిస్తున్నది. పెరుగుతున్న ధరలను చూస్తే, సామాన్య మానవుని జీవిత విధానం ఎంత బాధామయమో! ఇలాంటప్పుడు దీపావళిని సరదాల పండుగగా జరుపుకోవడం అవసరమా అనిపిస్తుంది." అయినా, అందరికీ యిష్టమైన పండగ గావడంచేత, దేశమంతా దీపాల కాంతులతో మెరిసిపోతుంది అన్నది తెనుగు వారి అభిమాన "ఊర్వశి"

కాకరొత్తుల పూల జల్లులు, విష్ణు—భూచక్రాల పరిభ్రమణాలు, చిచ్చుబుడ్ల మెరుపులు, టపాకాయల మ్రోతలు గతంలో వున్నంతగా యీ ఏడు వుండదేమో ననెడి అభిప్రాయం తనకు వున్నట్లు ఆమె చెప్పింది

*మరుపురాని ఓ దీపావళి*

"ఓ దీపావళి రోజున నే నెన్నడూ మరువలేని సంఘటన జరిగింది అందరితోబాటు తెల్లవారు జామున తల స్నానం చేసి, కొత్త గుడ్డలు వేసుకుని, దీ పా వ ళి స్వీట్లు తిని వుత్సాహంగా వున్న నేను మూడు చక్రాల పిల్లల సైకిలెక్కి, సరిగ్గా త్రొక్కడం చేతగాక, ఆ సైకిలును పైన వేసుకుని, నడి రోడ్డులో నడిచే నలుగురి నవ్వుల వర్షానికి గురి అయ్యాను నరుగిడే వుత్సాహం నన్ను ఎంత ప్రమాదానికి, అవమానానికి గురి చేసింది అప్పట్నుంచి ఏ పని చేసినా, అది నా వయస్సుకు సరిపడ్డదేనా అని ఆలోచించిగాని చెయ్యను" అన్నదామె

నలుగురితోబాటు నారాయణా అంటారే, అదే విధంగా అందరూ కాల్చే టపాకాయలను, కాకరవత్తులను కాల్చడాన్ని మానెయ్యనూలేను, అందుకని అధికంగా డబ్బు వ్యయం చెయ్యనూలేను

వచ్చే దీపావళి నాటికైనా మన దేశం సుభిక్షంగా వుండాలని, ప్రజలకు కష్టనష్టాలు రాకుండా వుండాలని, ధరల నరకాసురుడు సంహరించబడాలని ఆశిస్తున్నా నన్నదామె

## సినిమా

అందరూ పాల్గొంటున్న ఫస్టు చిత్రం యిది

ఇన్ని ఫస్టులకు నోచుకొన్న "బాబు" చిత్రంలో శోభన్‌బాబు, వాణిశ్రీ, లక్ష్మి, గుమ్మడి, సత్యనారాయణ, రాజబాబు, అల్లురామలింగయ్య, రమాప్రభ ప్రధాన పాత్రధారులు బహుముఖ వ్యాపారవేత్త సీజర్ సమర్పిస్తున్న ఈ చిత్రానికి కుమార్ నిర్మాత

వచ్చే ఏడు శోభన్ నటించిన చిత్రాలలో ఫస్టు విడుదలయ్యే చిత్రం కూడా ఇదే లక్ష్మి ఫిలింస్ విడుదల.

*భగవాన్! ఎందుకీ కసి?*

అంటూ వాపోయింది ఓ అమాయకురాలు. ఆమె పేరు మాధవి. ప్రొఫెషన్ వైద్యం. తెలిసో, తెలియకో జీవితంలో తప్పటడుగు వేసింది తత్ఫలితంగా ఒక బిడ్డకు తల్లి అయింది. భగవంతుడెందుకో ఆవిడపట్ల చిన్నచూపు చూశాడు. ఆవిడ జీవితంతో చెలగాటమాడాడు. సమస్యల నన్నింటిని సంతోషంగా, నవ్వుతూనే అనుభవించింది మాధవి ఎందుకో తెలుసా? తన బిడ్డ తన కళ్ళముందే ముద్దు ముద్దుగా ఆడుతూ, మాటాడుతూ పెరిగి పెద్దవాడవుతున్నాడనే ఆత్మానందంలో తన మనశ్శోభను కడుపులోనే దాచుకుంది. కానీ ఆ భగవంతునికి తన కసి తీరలేదు. అందుకే మాధవి బిడ్డను ఆవిడ నుండి దూరం చేశాడు. కష్టాలను, కలతలను అనుభవించిన మాధవి కన్నబిడ్డ దూరమైపోతుంటే కన్నీళ్ళను ఆపుకోలేకపోయింది. బోరున ఏడ్చింది తన బిడ్డను పొట్టన పెట్టుకున్న దేవుణ్ణి పిచ్చి పిచ్చిగా తిట్టింది. కానీ ప్రయోజనం? శూన్యం. అందుకే మాధవి తనువును చాలించడానికి నిశ్చయించి, ఆత్మహత్య చేసుకుంది గెలిచానని అనుకుంటున్న దేవుణ్ణి తన చావుతో గెలుచుకుంది మాధవి ఈ కన్నీటి సన్నివేశం "అమ్మ మనసు" చిత్రంలో కన్పిస్తుంది మాధవిగా జయంతి నటించిన ఈ చిత్రానికి జి వి యస్ రాజు నిర్మాత. కె విశ్వనాథ్ దర్శకుడు








# నవజ్యోతి ప్రచురణలు

ఆంధ్రపాఠక మహాశయులకు దీపావళి శుభాకాంక్షలతో.

## పరిమళా సోమేశ్వర్

| | |
|---|---|
| పిల్లలతో ప్రేమయాత్ర | 6-00 |
| ప్రణయజీవులు | 8-00 |
| ఈ తరం స్త్రీలు | 7-00 |
| తప్పటడుగు | 7-00 |
| సుగంధి | 8-00 |
| నర్తకి | 8-00 |
| భర్తను లొంగదీసుకోవడం ఎలా? | 3-00 |

## చిట్టిరెడ్డి సూర్యకుమారి

| | |
|---|---|
| ఉదాత్త చరితులు | 6-00 |
| మట్టిబొమ్మలు | 7-50 |
| కన్నెపిల్లలు | 7-50 |
| పరిభ్రమణం | 6-00 |
| కవిత | 5-00 |

## అరవింద (ఎ.ఎస్.మణి)

| | |
|---|---|
| అవతలిగట్టు | 9-00 |
| పగిలిన ప్రతిమ | 8-00 |
| ప్రేమ [illegible] | 5-00 |

## దేవరకొండ చిన్నికృష్ణశర్మ

| | |
|---|---|
| రామాభ్యుదయము | 7-50 |
| నిర్వచనోత్తర రామాయణము | 5-00 |
| నృసింహపురాణము | 4-50 |
| భోజరాజీయము | 7-50 |
| శశిరేఖాపరిణయము | 5-00 |
| హరిశ్చంద్రోపాఖ్యానము | 4-50 |
| శశాంకవిజయము | 4-00 |
| సారంగధర చరిత్రము | 4-50 |
| రాజశేఖరచరిత్రము | 3-00 |
| చంద్రభాను చరిత్రము | 5-00 |
| ఉద్భటారాధ్యచరిత్రము | 5-00 |
| రుక్మాంగద చరిత్రము | 5-00 |
| అనిరుద్ధచరిత్రము | 4-00 |
| శివరాత్రి మాహాత్మ్యము | 3-00 |
| ఘటికాచలమాహాత్మ్యము | 2-50 |
| వైజయంతీవిలాసము | 2-50 |
| రాధికాసాంత్వనము | 3-50 |
| అహల్యాసంక్రందనము | 2-50 |
| క్రీడాభిరామము | 2-50 |
| బిల్హణీయము | 4-50 |

## పోల్కంపల్లి శాంతాదేవి

| | |
|---|---|
| ప్రేమబంధం | 7-50 |
| మనసు ఒకరికే మనిషి ఒకరికే | 6-00 |
| పువ్వులపడవ | 6-00 |
| రేకులు విరిసిన మొగ్గ | 3-50 |
| జీవనవీణ | 3-50 |
| ఠక్కురసంఘమిత్ర | 4-00 |
| నిశిరాత్రిలో నక్షత్రప్రభలు | 6-00 |
| పచ్చిక | 5-00 |
| వెండి అంచు | 5-00 |
| పూజాకుసుమం | 5-00 |

## యలమంచిలి ఝాన్సీలక్ష్మి

| | |
|---|---|
| గాజుబొమ్మ | 5-00 |
| మనుషులు-మమతలూ | 8-00 |
| వెలుగునీడలు | 8-00 |
| అనూరాధ | 7-00 |
| రాగమయి | 5-00 |

## గోపీచంద్

| | |
|---|---|
| మెరుపులు [illegible] | [illegible] |
| భార్యలకోసం ప్రాంతి [illegible] | 2-00 |
| దేశం ఏమయ్యేట్టు? | 2-00 |
| గతిపారాయణం | 2-00 |
| తండ్రులూ-కొడుకులూ | 2-00 |
| ధర్మసుపత్రి | 2-00 |
| ఇరుగుపొరుగు | 2-00 |
| సరే కానివ్వండి | 2-00 |
| దేవుని జీవితం | 2-00 |
| పాతపగలూ-కొత్తవగలూ | 2-00 |
| మాకూ వున్నాయి స్వగతాలు | 2-00 |
| కూపస్థమాండూక్యం | 2-00 |
| జనానా | 2-00 |
| గోపీచంద్ కథలు 1వ | 10-00 |
| గోపీచంద్ కథలు 2వ | 10-00 |
| గోపీచంద్ కథలు 3వ | 10-00 |

**నవజ్యోతి పబ్లికేషన్స్**
**ఏలూరురోడ్ :: విజయవాడ-2**

## కె. వసుంధరా దేవి

| | |
|---|---|
| ఆదర్శాలు-అనుబంధాలు | 8-00 |
| రాగోదయం | 7-00 |
| ఆశయాలు-ఆవేశాలు | 7-00 |
| జీవితపు మలుపులు | 7-00 |
| గాలివాన | 5-00 |
| సాగరి | 5-00 |
| రాధిక | 6-00 |

## ముద్దా [illegible]

| | |
|---|---|
| ఊహలూ-నిజాలు | 5-00 |
| మంచికే గెలుపు | 6-00 |
| ఆశాజీవి | 6-00 |
| ఇది త్యాగం కాదు | 6-00 |
| వ్యక్తిత్వాలు | 6-00 |

## శిఖా వెంకటరమణా రాజ్

| | |
|---|---|
| గాజుబొమ్మలు | 5-00 |
| [illegible] ముత్యాలు | 5-00 |

## [illegible] రచయిత్రుల రచనలు

| | | |
|---|---|---|
| [illegible] | [illegible] | 6-00 |
| అమృత [illegible] | [illegible] | 7-50 |
| ఇదే స్వర్గం ఇదే నరకం | బి. విజయ కాంతిరావు | 5-00 |
| శాపగ్రస్తులు | రామచంద్రవల్లి | 6-00 |
| పునరావృతం | డా॥ వ రాజారామ్ | 5-00 |
| నిడుదుగులు | నిరుద్యోగి | 4-00 |
| కొండలయ్య చేతిలో విక్రమార్కీయం | | 4-00 |
| పూలు-పడుగలు | పి. కనకాంబరరాజు | 6-50 |
| ఇంటింటి వంటలు | సినీనటి సూర్యకాంతం | 7-50 |
| ఉన్నతశిఖరాలు | కోమలాదేవి | 8-00 |
| హెడ్‌మిస్ట్రెస్ హేమలత | అవసరాల రామకృష్ణారావు | 8-00 |
| సమాంతరరేఖలు | పి. మల్లికార్జునరావు | 10-00 |
| వింతహృదయాలు. | రాధ | 7-00 |
| జీవనవలయం | సర్వతి బాబురావ్ | 5-00 |
| వేడివెన్నెల | యస్ వివేకానంద | 5-00 |
| మేఘమాల. | పి యస్ నారాయణ | 7-00 |
| జ్యోతి. | యం రామకోటి | 7-00 |
| పూజాఫలం. | విభావసు | 7-00 |
| మాయమనసు | పా వెంకటేశ్వరరావు | 5-00 |
| ఆంధ్రప్రదేశ్ రాజకీయ-పరిణామచరిత్ర. | | 2-50 |
| అడ్డుగోడలు | ఇన్నయ్య డి. రామలింగం | 12-50 |



"పుట్టింటి గౌరవం"లో భారతి

# సినిమా

## విద్యార్థి నాయకుడు

అని శోభన్‌బాబును సంబోధించడానికి నేను సంశయించడంలేదు. గత వారం ఆంధ్రదేశం పర్యటించినప్పుడు, జగపతివారి "మంచి మనుషులు" వర్ణ చిత్రాన్ని ప్రేక్షకుల నడుమ కూర్చుని చూశాను. ఆ చిత్రంలో శోభన్‌బాబు నటన కయితేనేమి, పాటలకు అనుగుణంగా అడుగులు వేసినప్పు డయితేనేమి, కరతాళ ధ్వనులు మిన్ను ముట్టాయి. ఆ శబ్దం వచ్చినచోటు ఎక్కడని తెలుసుకొన్నాను. కుర్చీలో ఆసీనులయిన విద్యార్థి బృందం చేసిన ఆనంద ఘోష అని పసిగట్టాను. విద్యార్థులను ఆకర్షిస్తున్న శోభన్‌బాబును విద్యార్థి నాయకుడు అనడంలో తప్పు వుందంటారా ?

ఇంతవరకు శోభన్ ఎన్నో చిత్రాలలో నటించి ప్రజలను మెప్పించినప్పటికీ, మంచి మనుషులు శోభన్‌కి వచ్చిన ప్రశంసల ముందు రవ్వంతే అనిపిస్తుంది.

జగపతి రాజేంద్రప్రసాద్ నిర్మించే చిత్రాలపై ప్రజలకు ప్రత్యేక అభిమానం వున్నదన్న నిజాన్ని మరోసారి 'మంచి మనుషులు" చిత్రం నిరూపించింది. శోభన్‌బాబు మార్కెట్టును మరింత పెంచిన చిత్రం "మంచి మనుషులు"

## మధురాతి మధురమే !

వినే ప్రతిపాట మధుర మధురంగా వున్నదని సంగీత జ్ఞానం వున్న ఏ వ్యక్తి అనడు. విన్నది మంచిపాట అయినప్పుడు, దానిని పదే పదే పాడుకునేందుకు వెనుకాడడు.

గత వారం జి. కె. వెంకటేష్ సంగీతం సమకూర్చిన, బాలు – జానకి పాడిన పాటను విన్నాను. నామటుకు నేను పదిసార్లు విన్నా తనివితీరలేదు. మధుర మధురంగా వున్నదా పాట. బాలసుబ్రమణ్యం గళ మాధుర్యాన్ని ప్రశంసించనా, జానకి మెలోడీని గూర్చి వివరించనా ? ఇంత మధురమైన పాటను "ఆడవాళ్లు – అపనిందలు" చిత్రంలో వినవచ్చు. పాట సన్నివేశం గూర్చి దర్శకుడు బి. ఎస్. నారాయణ వివరించారు.

కృష్ణంరాజు, శుభ దంపతులైనది మొదలు తొలిరేయి అగాయిత్యం ఆనాటి వారి కార్యక్రమం అంతా యిమిడియున్న పాటలో రవ్వంతను పాఠకులకు రుచి చూపిస్తాను.

కనులు కనులు కలుసుకుంటే మౌనం

మనసు మనసు పిలుచుకుంటే గానం. ఈ పాటను మధుర కవి డాక్టర్ నారాయణరెడ్డి రాశారు.

## ఎవ్వోడి పెళ్ళి

హాస్య నట చక్రవర్తి బిరుదాంకితుడు ప్రేక్షకుల కిష్టుడు అయిన రాజబాబు ప్రధాన పాత్రను పోషిస్తున్న ఎవ్వోడి పెళ్ళి చిత్ర షూటింగు వాహినీలో ప్రారంభమైంది. ఈ చిత్రానికి కె. ఎస్. రెడ్డి దర్శకుడు. కథ మాటలను ఎం. శెట్టి వ్రాశారు.

సంగీతసారథి సత్యం. విజయదశమినాడు ప్రసిద్ధ కవి ఆరుద్ర రాసిన 'దేవుడు చేసిన పెళ్ళి యిదే' అనేడి బాలు పాడిన పాటను రికార్డ్ చేశారు. ఈ చిత్రానికి హరిదాస్ కెమెరాకు, కందస్వామి కూర్పుకు, బి. ఎస్. రెడ్డి కళకు భర్తలుగా వ్యవహరిస్తున్నారు.

హీరోగా రామకృష్ణ నటిస్తున్న ఈ చిత్రానికి కె. మురళీకృష్ణ నిర్మాత. ప్రధాన భూమికలను గుమ్మడి, సూర్యకాంతం, కొమ్మినేని చంద్ర

రామాంజనేయ యుద్ధం లో



## కాంతి స్తంభాలు

— రామా చంద్రమౌళి

చరిత్ర పుటల మీది నుండి నడిచి వస్తూ
ఎన్నాళ్ళనుండో మనుషులను చదువుతున్నాను
ఎప్పుడో ఏదో సాధించామని
అందరూ దీపాలను వెలిగిస్తున్నారు — తరతరాల్నుండి
కాని, ప్రతివాని గుండెలోనూ ఎంత చీకటి,
చిక్కగా, కందెన ముద్దలా, వికృతంగా ఎన్ని
తమోఛాయలు
వలువు జాడలు బయటికి కనిపిస్తాయేమోనని
ముందు జాగ్రత్త కోసం అందరూ జ్యోతి
నంటిస్తున్నారు — ఎందుకంటే
నైతికంగా అందరూ రాక్షసులే
సరే—ఎలాగూ దీపాలు ఆరిపోతాయి ఎప్పుడో ఒకప్పుడు
అందుకని మనుషుల్లో కాంతి బీజాలను నాటుతున్నాను
శిశువుగానో,
పశువుగానో కాకుండా మనిషిలా
గుండెల్లో వెలుగు స్తంభాలతో నిటువెత్తు
నిటారుగా నడవాలని





## 'గీత' తెలుసా?

నీకు గీత తెలుసా!
నీ క్లాస్‌మేటు రెండు జడల
గీత గురించి కాదు నే నడుగుత,
నీ నొసటి గీత గురించి.
తెలియదూ! అయితే గీతా హోటల్‌కి వెళ్లి
నొసట్న మూడు గీతలు పెట్టినవాడికి
నీ చేతి గీతలు చూపించి
నీ నొసటి గీత గురించి అడుగు
అతడు నీ విచ్చిన గీతం పుచ్చుకుని
నీ నొసటి అదృష్ట గీతను మార్చి
దురదృష్ట గీతను చేర్చి, శని పూజలు చేయించి
సెవెంటీఫైవ్ అంటేడెబ్భైఅయిదు బిల్లిస్తాడు.
అవుంటే పిల్లాడి పాలడబ్బాలు రావూ!
పెండ్లానికి పరువు నిలపను బట్టలు రావా?
వస్తాయి! ఎందుకు రావూ!
కానీ ఆ సెవెంటీఫైవ్ అనుభవించే
గీత నీ చేతిలో లేదు.
అదే నీ నొసటి గీత.

— ఎస్. లక్ష్మీనరసమ్మ

మోహన్, అల్లురామలింగయ్య ధరిస్తున్నారు. హీరోయిన్‌గా విజయనిర్మల నటిస్తున్నారు.

అందరిచేత "పిచ్చోడు ... పిచ్చోడు" అని ఎరిహసించబడ్డ ఒక అమాయకుడ్ని పెండ్లాడి అతడు ఇతరులకన్నా మిన్న అయినవాడు అని నిరూపించిన ఒక ఉత్తమురాలి జీవిత కథ "పిచ్చోడి పెళ్లి".

### ఆర్. కె. ఆర్ట్స్ రంగుల చిత్రం

ప్రముఖ రచయిత పాలగుమ్మి పద్మరాజు రాసిన నల్లరేగడ" కథను ఆర్. కె. ఆర్ట్స్ అధినేత కె. ఆర్. రావ్ రంగుల చిత్రంగా నిర్మిస్తున్నారు. ఈ చిత్రానికి కె. హేమాంబరధరరావు దర్శకుడు.

ప్రధాన పాత్రలను కృష్ణంరాజు, లక్ష్మి, రాజబాబు, అల్లురామలింగయ్య, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, రావుగోపాలరావు, గిరిబాబు పోషిస్తున్నారు. డిశంబరు నుండి షూటింగు ఆరంభం.

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగారి పిలుపుకు మద్దతునిస్తూ ఈ చిత్రం షూటింగును ఆంధ్రప్రదేశ్‌లో జరపడానికి నిర్మాత నిశ్చయించారు. ఈ చిత్రానికి గోపీ మాటలను, రాఘవులు సంగీతాన్ని, బి. ఎస్. కృష్ణ కళను నిర్వహిస్తున్నారు.

ఇదే చిత్రం న్యూస్ రాస్తూ, కథానాయకుడి పాత్ర మరో హీరో పోషిస్తున్నట్టు గత నెల వ్రాశాను. కాల్‌షీట్లు లేకపోవడంచేత, మరొక నిర్ణయాన్ని నిర్మాత తీసుకోవలసి వచ్చింది. లక్ష్మి ఫిలింస్ విడుదల.

### "పెళ్లి పందిరి"

విజయ వేలాంగణి పిక్చర్స్ నిర్మిస్తున్న "పెళ్లి పందిరి" చిత్రంలో గాఢానురాగబద్ధులైన ప్రేమికులుగా చంద్రమోహన్, రోజారమణి నటిస్తున్నారు. క్షణమైనా ఒకర్ని విడిచి మరొకరు వుండలేని అవస్థ వాళ్లది మూడు ముళ్లు పడితే వాళ్ల ప్రేమ సామ్రాజ్యానికి అడ్డంకు వుండేది కాదు.

వాళ్ల ప్రేమ ముదిరి పాకానపడింది. అక్కడ ఆ యిద్దరూ తప్ప మరొకరు లేరు. పైగా ఆమె జడివానలో తడిసిన మూలంగా, యవ్వనపు పొంగు బుసలు కొడుతూ కనిపించింది. ప్రేమికులు పడే మన్మథావస్థపై మహాకవి దేవులపల్లి ఒక మధుర గీతాన్ని రాశారు. అదేమిటన.

అతడు : ఘడియాగవా, ఒక్క ఘడియాగవా?
వలపు వొడిలోన మరికాస్త వడి వూగనీ,
ఆమె : తడవారనీ, గుండె వడియారనీ
వాన జడిలోన, వొడలంత తడిసిందనీ.



"చిన్ననాటి కలలు"లో కృష్ణంరాజు, కాంచన

ఈ పాటను సుశీల, బాలు మధురాతి మధురంగా పాడారు. రాజేశ్వరరావు సంగీతం సమకూర్చారు. ఈ చిత్రానికి దాసరి నారాయణరావు కథకుడు + దర్శకుడు. మర్రి రెడ్డి నిర్మిస్తున్న యీ చిత్రంలో సత్యనారాయణ, రాజసులోచన, రాజబాబు, అల్లు రామలింగయ్య, కొమ్మినేని ప్రధాన పాత్రధారులు.

## అక్కినేని

[23 వ పేజీ తరువాయి]

వున్నవే. తానూహించుకున్న పాత్రలను చిత్రాలుగా తియ్యడానికి ముందుకొస్తున్నారు నిర్మాతలు. వారికి పూర్తి సహకారాన్ని అందచేయడానికి, తన నటనలో నూతనత్వం చూపించి, క్రొత్త సృష్టి చేయడానికి నడుంకట్టారు నాగేశ్వరరావు.

"భక్తతుకారాం"గా ప్రజల మన్నన లందుకున్న వారు "మహాకవి క్షేత్రయ్య", "త్యాగరాజు", "యోగివేమన" లాంటి పాత్రలను అతి త్వరలో పోషించబోతున్నారు.

ప్రస్తుతం వారు అమెరికాలో తన చిరంజీవి (కుమార్తె) వద్ద విశ్రాంతి తీసుకుంటున్నారు. డిశంబరులో స్వదేశానికి తిరిగివచ్చి జనవరి (1975) నుంచి షూటింగుల్లో పాల్గొంటారు.

### మహానటుడు అక్కినేని

నటనకు నిర్వచనం చెప్పగల్గిన, ఆ నిర్వచనాన్ని తన నటనా ప్రతిభతో నిరూపించ గల్గిన మహానటులు అక్కినేని. పరిశ్రమలో ఇంకా పది కాలాలపాటు పచ్చగావుండి ముందుతరం నటులకు ఆదర్శవంతులై, వెలుగొందాలని ఆశిద్దాం. ఇన్ని సుగుణాలను గొన్న ఈ రైతుబిడ్డను కారణజన్ముడంటే తప్పా?

— శ్రీనివాస్



"అన్నదమ్ముల కథ"లో బాలయ్య, రోజారమణి





వచ్చాను అమలాపురం వెళ్లాలి కండక్టర్! ప్లీజ్''

''సారీ!. నేను యేం చెయ్యలేనండి దిగండి'' అన్నాడు కండక్టర్ డోర్ పట్టు కుంటూ

''నో, నో! ఇక్కడ యెరిగున్న వాళ్లెవ్వరూ లేరు నాకు జేబులో యింక నయా పైస కూడ లేదు నా కెవరు డబ్బు లిస్తారు? నేను రాకపోతే మా నాన్నగారు అమలాపురం బస్సు స్టాండులోనే నాకోసం యెదురు చూస్తూ కూర్చునిపోతారు ప్లీజ్''

''నో యూస్ చెప్పాముకదండి అవతల మాకు డిలే అవుతుంది, దిగండి''

''దిగవయ్యా బాబూ!'' అన్నారు ఏక కంఠంతో ముందున్న పాసెంజర్లు

బిక్కమొహం వేసిన ఆ కుర్రాడిని చూస్తుంటే అబద్ధం ఆడటంలేదని తెలుస్తూనే ఉంది అప్రయత్నంగానే శ్రీహరి జేబులో చెయ్యి పెట్టి పది రూపాయలు నోటు తీసి కండక్టరు చేతిలో ఉంచుతూ ''ఆయనకి అమలాపురానికి టిక్కట్టు యివ్వండి'' అన్నాడు ముక్తసరిగా

ఆ కుర్రాడు గబుక్కున శ్రీహరినిసమీపించి రెండు చేతులూ పట్టుకుని ''థాంక్యూ, థాంక్యూసర్ వెరీ మచ్'' అంటూ ఆనంద బాష్పాలు రాల్చాడు

''మీ ఎడ్రస్ యివ్వండిసర్! మీకు యం ఓ చేస్తాను'' అన్నాడు కండక్టరు దగ్గర టిక్కట్టు తీసుకుని అతను యిచ్చిన చిల్లర శ్రీహరి చేతిలో వుంచుతూ

సమాధానంగా శ్రీహరి ''అలాగేలెండి ముందు మీరు స్థిమితంగా కూర్చోండి'' అన్నాడు ఆ కుర్రాడు వెళ్లి వెనక సీట్లో కూర్చున్నాడు

ఈ సంఘటన మనస్సును మరోదెసకు మళ్లించింది

''డబ్బంతా అడ్డమయినవాళ్లకు దానం చెయ్యటానికే సరిపోయే! ఇంట్లో అవసరాలు చెప్పబోతే మాత్రం 'చర్' మంటూ ఒంటికాలుమీద లేస్తారు. ఇంతకూ మేనమామ కూతుర్ననేకదా ఈ అలుసు'' అంటూ సాధిస్తుంది తను సుముఖంగావున్న సమయం చూసి

''మేనమామ కూతురువని యిప్పుడు నీకు తక్కువ జరిగిందేమిటని?''

''ఆc! ఆc! జరుగుతున్నాయి ఎక్కడ లేని రాజభోగాలూ!''

# గృహ విక్రయం

(25వ పేజీ తరువాయి)

''ఓ బంగారపుతొడుగు చేయిస్తానులే యీసారి''

''తొడుగా? పోగు, ఆఖరకు మాలు పోగు వాసికూడ చూస్తూ చూస్తూ మీ చేత్తో కొనరు, కొనలేరు నాకు తెల్సు'' అంది అదోలా మొహంపెడుతూ

బుజ్జగిస్తున్నట్లు తను అనేవాడు ''వెర్రి

## దీపాల తోరణాలు

వెలిగించండి, వెలిగించండి
దీపాల తోరణాలు
రగిలించండి, రగిలించండి
దీపాల తోరణాలు
సామాన్యుడు మాన్యుండై
విర్చిన రోజిది
ఒక అబలే సబలై
గెల్చిన రోజిది!
గర్వాంధుడు, నరాధముడు
పొగరెక్కి, తెగనిక్కి
సామాన్యుల, సంసారుల
బలిపెడ్తే, బాధల గురిపెడ్తే
అబలే సబలై శస్త్రాన్ని పూని
పాపపు నరకాసురుణ్ని పడగొట్టి,
సామాన్యుని మాన్యుని చేసిన రోజిది
సమతావాదానికి నాంది యిది
ప్రతి అబలా, సబలగా
ప్రతి సామాన్యుడు మాన్యుడుగా
ప్రతిఫలిస్తున్న కాంతితో
వికటిస్తున్న చీకటిని తరిమి
వెలిగించండి, వెలిగించండి
దీపాల తోరణాలు

— రావులపాటి

మొహమా! మనిషికి కావల్సినవి మంచితనం, మానవత్వం కూడ వచ్చేవవే, యివేంకావు''

''ఇంట్లోవాళ్ల మనుష్యులుకారు, వాళ్ల ముందు మంచితనం, మానవత్వం అక్కర్లేదు .. వెళ్లండి!'' అంటూ కోపంగా అక్కడనుంచి లేచిపోయేది విసవిసా

తను చేయించగల్గిన స్థితిలో ఉండి కావాలనే చేయించనట్లు మాట్లాడుతుంది ఇది రమ మూర్ఖత్వం!. రమ స్థానంలో కమలే ఉంటే! కమల, తను అంటే ప్రాణం యిచ్చే కమల, మాష్టారి కమల ఎలా ఉందో యెక్కడ ఉందో! కమలకు యేనాడో పెళ్లి చేసేసి ఉంటారు మాష్టారు అమె, అమె భర్త, ఆమె సంసారం — యీ తాపత్రయంలో పడి తనను యెప్పుడో మర్చిపోయి ఉంటుంది అంత సులువా అది?

ఆ రోజు స్కూలుకు సెలవు తను తమ యింట్లో అద్దర పెరట్లో కొబ్బరి మొక్కలకు నీళ్లు పోస్తుంటే కమల వచ్చింది

'నేను నీళ్లు తోడుతాను, నువ్వు తీసుకెళ్లి పొయ్యి'' అంటూ బాల్చీ అందుకుని నూతిలో నీళ్లు తోడి బిందెలలో నింపటానికుపక్రమించింది

నీళ్లు పొయ్యటం అయ్యాక తనే అన్నాడు ''ఈ గంగా బొండాల చెట్టు యెక్కి కొబ్బరి బొండాలు తీస్తాను ఇద్దరం త్రాగచ్చు ఏం?''

''వద్దు బాబూ! నువ్వీ చెట్టు యెక్కలేవు'' అంది వారిస్తూ

తనే నవ్వుచెప్పి యెక్కాడు నాలుగు బొండాలు తీసాడు క్రిందకు జారాక చూస్తే, కొబ్బరి చెట్టు యెక్కడం అదే మొదటి సారేమో వళ్లంతా గీసుకుపోయింది

అటు చూస్తే కమల యెక్కెక్కి ఏడుస్తూంది

''ఏమిటి? ఏం జరిగింది?'' ఆతురతగా అడిగాడు

''నేను యెక్కద్దని చెప్తే విన్నావా? చూడు నీ పొట్ట, ఛాతీ ఎలా కందిపోయిందో!''

''అదే పోతుందిలే, దీనికే'' అన్నాడు లాలనగా

కమల ఊరుకోలేదు లోపలకు వెళ్లి కొబ్బరినూనె తీసుకువచ్చి గీసుకుపోయిన చోటల్లా వ్రాసింది ఆమె చూపించిన శ్రద్ధకు తను ఎంతో మురిసిపోయాడు ఒక విచిత్రమయిన అనుభూతి కలుగుతుంది అదంతా ఇప్పుడు తలపుకువస్తే, భార్యాభర్తలు ఒకరినుంచి మరొకరు ఈ రకమయిన అనుభూతులనే ఆశించి తహతహలాడి పోతుంటారు అటువంటిది లభ్యమయినచోట, జన్మంతా ఆ స్థితిలోనే ఉండిపోతే ఎంత బావుండును అనిపిస్తుంది

తను కాలేజీ చదువుకని అమలాపురం రేపే బయలుదేరతాడు ఆరోజు కమల వచ్చింది అద్దర పెరట్లో మావిడి మొక్క కింద తడక వేసుకుని కూర్చున్నారు చాల సేపు యిద్దరూ పరస్పరం చూసుకుంటూ

# గృహవిక్రయం

నిశ్శబ్దంగా కూర్చునిపోయారు.

చాలాసేపటికి - కమల "అయితే నువ్వు అక్కడే ఉండిపోవాలా?" అడిగింది దిగాలుగా

"ఆహా! లేకపోతే, యిక్కడినుంచి వెళ్లిరాడం రోజూ జరగనిది"

"మరి నీ భోజనమో?" అడిగింది అమాయకంగా

"హోటల్లో"

"హోటలు భోజనం బావుండదట, పైగా జబ్బు చేస్తుందట" అంది తన సందేహాన్ని వెలిబుచ్చుతూ

తనేమో ఆరిందాలాగ "ఆఁ! అదంతా ఇంతను అంతచేసి చెప్పిన మాటలులే ఇయిన గత్యంతరం ఏముంది?"

ఆమె యింక ఆపుకోలేక అశ్రుశిక్తనయన అయింది

ఆమె కనులు వేలుతో తుడుస్తూ "ఛ! ఏమిటి మరీ పసిపిల్లలాగ" అన్నాడు పెద్దరికపు హుందా తెచ్చుకుని.

ఆ తరువాత తమను యించుమించు శాసిస్తూ "వారాని కొకసారయినా రాకపోతే నన్ను చంపుకు తిన్నంత ఒట్టు ఆఁ!" అంది

తను 'అలాగే' అని చేతిలో చెయ్యి వేసి మరీ కదిలాడు

తన కాలేజీ చదువు ఏడాది పూర్తి అయింది ఆ వేసవి సెలవుల్లోనే తన తండ్రి హృద్రోగంతో మరణించడం, అమ్మతో తను మేనమామగారింటికి విజయవాడ వచ్చేయడం జరిగింది తను ఆ ఊరు విడిచిపెట్టకుండా ఉండటానికి యెంతో ప్రయత్నించాడు కమలకు తనకూ మధ్య ఉన్న బంధం అటు మేనమామకుగాని, యిటు అమ్మకుగాని యెలా తెలుస్తుంది. అమ్మ అర్థం చేసుకోగలదు కాని అమ్మ అశక్తురాలయి ఊరుకుంది ఆమె అప్పటి దుఃఖంలో తమా కమల అసలు ప్రవేశించే ఉండరు అమ్మ అన్నగారి పంచకు వెళ్లటానికే నిర్ణయించుకుంది

ఒంటెద్దు బండిలో వెనక కూర్చున్న తను మాష్టారి యింటికేసి చూస్తే అక్కడ అరుగుమీద మూర్తీభవించిన శోకమూర్తిలాగ నిల్చుని కమల కనిపించింది అంతక్రితం రోజున మాష్టారిని చూడటానికి వెళ్లినప్పుడు ఆయనకూడ పాలిపోయిన మొహంతో కనిపించారు

"రేపేనా ప్రయాణం?" లాంఛనప్రాయంగా అడిగారు

"అవును మాష్టారు!.. కాని నాకేమో అక్కడకు వెళ్లటం సుతరామూ యిష్టం లేదు" అంటూ యేదో చెప్పబోయాడు

ఆ మాటలను పట్టించుకోనట్టే మాష్టారు "శ్రద్ధగా చదువుకుని వృద్ధిలోకి రా గురువుగా నేను కోరేదదే" అన్నారు

అత్తయ్యగారికి చెప్పటానికి లోపలకు వెళ్లి కమలకోసం యిటూ అటూ చూసాడు కనిపించలేదు ఇదివరకటి చనవు తనకా యింట్లో లేదేమో అనిపించింది నిరాశతో నిస్పృహతో యాంత్రికంగా యింటికి వచ్చేసాడు ఇప్పుడు తను వెళ్లిపోతుంటే అరుగు మీద శిలావిగ్రహంలాగ నిల్చునిపోయిన కమలను చూడగలిగాడు కళ్లు చెమ్మగిలాయి, గుండె బరువు అయింది అంతే,




కనిపించేవరకు కమలను చూసాడు మళ్లా ఆనాటి నుంచి యీనాటిదాక కమలను చూడటం జరగలేదు!!

రమతో తన పెళ్లి స్థిరం చేసిననాడు తన హృదయం ఎంతగానో విలవిల్లాడిపోయింది అయితే, మావయ్యగారింట్లో అమ్మా, తనూ ప్రవేశించిన కొద్దిరోజులకే రమ తన భార్య అవటాన్ని ఏ భగవంతుడో అడ్డుపడి ఆపుచేస్తే తప్ప ఆగనిదని తను సులభంగా గ్రహించినదే తను మూగగా అనుభవించిన ఆవేదన యింత అంతా కాదు. ఒక్కొక్కప్పుడు ఆ యింట్లోంచి పారిపోదామా అన్నంత ఆవేశం వచ్చేది అయితే అమ్మ మొహం చూసి తన యిచ్చకు వ్యతిరేకంగా అక్కడే పడివుండవలసి వచ్చేది

బస్సు రావులపాలెం రాగానే తనూ మరి కొంతమంది ప్రయాణీకులతో హోటలుకు వెళ్లి కాఫీ తాగి వచ్చాడు

తిరిగి బస్సు బయలుదేరి కోనసీమమీదుగా పోతుంటే – ఒకవైపు కాలవ, రెండవవైపు పచ్చటిపొలాలు చూస్తుంటే ఈ లోకం విడిచిపెట్టి మరో సుందరమయిన లోకానికి వచ్చినట్లుంది. కొబ్బరి తోటలు, చెఱకు, అరటి, కంద, వరి అంతా సశ్యశ్యామలంగా మనోహరంగా ఉంది.

బస్సు కొత్తపేట దాటింది తమ ఊరు దగ్గఱ పడుతున్నకొలది ఏమిటో చెప్పలేని ఆత్రం యెక్కువవుతూంది వెళ్లి మాష్టారి యింట్లోనే దిగాలి ఏమిటో యీ మనస్సు ఉబలాటం, కమలను ఒక్కసారయినా చూడగలిగితే చాలు అనిపిస్తుంది కమల యిప్పుడు పుట్టింటికి యెందుకు వస్తుంది, తన పిచ్చిగాని ఏమో యెందుకు రాకూడదు, తన అదృష్టవశాన!

ముక్కామల లాకు దగ్గఱ కండక్టర్ని కోరి బస్సు దిగేసరికి సాయంత్రం అయిదు గంటలు దాటిపోయింది ఇద్దరు, ముగ్గురు రిక్షా వాలా బాబుగారూ! అంటూ యెగబడ్డారు వద్దని చెప్పి చుట్టూ పరికాయించి చూసాడు ఆ ప్రదేశం యిదివరకెలా ఉండేదో యిప్పుడూ అలాగే ఉంది చెప్పుకోదగ్గ మార్పేమీ లేదు, ఒకటి రెండు కిళ్లీకొట్లు మాత్రం వెలిసాయి.

స్వామి కిళ్లీకొట్టు దగ్గఱకు వెళ్లగా అతడు తన్ను గుర్తుపట్టి సాదరంగా పలకరించాడు కుశల ప్రశ్నలు వేసాడు తను సోడా త్రాగుతూ యధాలాపంగా యెదురుగా కొంచెం అవతల వున్న కిరాణా కొట్టువైపు చూసాడు మాష్టారు మాష్టారిలా కనిపించారు

స్వామిని అడగ్గా "అవునండి ఆయనే! ఆయన బాగా చితికిపోయారు బాబూ!" అన్నాడు

"ఏం? ఏమిటి? ఎందుకని?" యెదఱకు అడుగు వెయ్యబోయినవాడు ఆగి అడిగాడు

"రిటైర్మెంటు అయిపోయారుగా! గవర్నమెంటు వాళ్లిచ్చే ఆ ఏభయో అరవయ్యో అంతే ఆయన భార్య పోయాక ఒకదాని తరువాత అన్నీ దెబ్బలే అయ్యా! ఆ రెండో పెళ్లి ముసలాడికి కూతుర్ని కట్టబెట్టడానికి యిల్లుకాస్త అమ్మేసారుకదా, ఆ అమ్మాయిగారేమో రెండేళ్లు తిరక్కుండానే ముండ మోసి యింటికి వచ్చింది ఆ అమ్మాయిగారే ఏదో తిని తినక గుట్టుగా నడుపుకొస్తున్నారు"

హృదయం ఛిద్రమయిపోయినట్లయింది శ్రీహరికి నోట మాట రాలేదు

స్వామి శ్రీహరిని అదోలా చూసి యిలా అన్నాడు మళ్లీ –

"కొడుకుకాస్తా మశూచికం వాతపడి










## హైదరాబాద్ నోట్ బుక్ —తిరుమల రామచంద్ర

### బాలల అకాడమీ

ఆంధ్రప్రదేశ్‌లోని వివిధ తెలుగు బాలల సంఘాల కార్యకలాపాలను సమన్వయ పరచడానికి బాలల అకాడెమీని స్థాపించడానికి రాష్ట్ర ప్రభుత్వం నిర్ణయించినట్టు విద్యామంత్రి శ్రీ మండలి వెంకట కృష్ణారావు అక్టోబరు 23న అఖిల భారత తెలుగు బాలల ఉత్సవంలో ప్రకటించడం బాలల సంఘాల వారికి చాల సంతోషం కలిగించింది నేటి బాలలే రేపటి పౌరులు బాలబాలికలలో అంతర్నిహితమైన శక్తులను ఉద్దీప్తం చేయడంలో ప్రభుత్వం తీసుకున్న ఈ శ్రద్ధ ఎంతో ప్రశంసనీయమని వేరుగా చెప్పనక్కరలేదు ఈ అఖిలభారత తెలుగు బాలల మహోత్సవం 23వ తేదీ నుండి నాలుగు రోజులపాటు మహావైభవోపేతంగా కేశవమెమోరియల్ స్కూలు ఆవరణలో జరిగింది దీనిలో కలకత్తా, మద్రాసు, బరంపూరు, ఖరగ్‌పూర్, బొంబాయి, ఢిల్లీ, బెంగుళూరు మొదలైన ప్రాంతాల నుండి వచ్చిన ప్రతినిధులతోసహా దాదాపు వేయిమంది బాలల ప్రతినిధులు పాల్గొన్నారు ఆర్థికమంత్రి శ్రీ పిడతలరంగారెడ్డి అధ్యక్షత వహించారు ప్రధానన్యాయమూర్తి శ్రీ వోబుల్‌రెడ్డి ప్రారంభోత్సవం జరిపారు రవాణా శాఖామంత్రి శ్రీ చొక్కారావు పుస్తక ప్రదర్శనానికి ప్రారంభోత్సవం చేశారు మహిళా సంక్షేమశాఖ మంత్రిణి శ్రీమతి ఎం లక్ష్మీదేవి ప్రత్యేక సంచికను ఆవిష్కరించారు నాలుగురోజులపాటు బాలల అభివృద్ధికి తీసుకోవలసిన చర్యలపై గోష్ఠులు, సదస్సులు, ప్రసంగాలు, చర్చలు, కవిసమ్మేళనాలు, బాల కళాప్రదర్శనలు, జరిగాయి ముగింపు సమావేశంలో ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావు ప్రసంగిస్తూ, దేశసమైక్యానికి ప్రాథమికావసరంగా తెలుగువారిలో భావసమైక్యం అత్యావశ్యకమని, దానికి ఇలాటి బాలల మహోత్సవాలు దోహదంచేస్తాయని అన్నారు అధికార భాష అయిన తెలుగు భాషకు నూతనోత్తేజం కలిగించడం బాలల విద్యనుంచే ప్రారంభం కావాలని అధికార భాషా కమిషన్ అధ్యక్షులు శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య, పిల్లల మనో వికాసానికి దేశయాత్ర అవసరమని ఆరోగ్యశాఖా మంత్రి శ్రీ రాజమల్లు ప్రసంగించారు నవంబరు నాల్గవ వారంలో అంతరరాష్ట్ర బాలల మహోత్సవం జరుగుతుందని, మాజీప్రధాన న్యాయమూర్తి శ్రీ గోపాలరావు ఎక్‌బోటే అధ్యక్షతన దీనికి ఆహ్వాన సంఘం ఏర్పడిందని విద్యామంత్రి శ్రీ మండలి కృష్ణారావు ప్రసంగించారు తెలుగు బాలల అభ్యున్నతి కోసం జీవితమంతా ధారపోసిన రేడియో అన్నయ్య, రేడియో అక్కయ్య శ్రీ న్యాపతిరాఘవరావును, శ్రీమతిన్యాపతి కామేశ్వరమ్మను ముఖ్యమంత్రి సన్మానించడం ఉత్సవానికి ముక్తాయింపుగా అందరికీ మహానందం కలిగించింది.

### శ్రీ డి ఆంజనేయులు

రచయిత, సహృదయుడు మిత్రుడు శ్రీ డి ఆంజనేయులు కేంద్రప్రభుత్వం స్థానిక సమాచారశాఖకు ప్రధానాధికారి కావడం సాహిత్య ప్రేమికులకు సంతోషం కలిగించింది శ్రీ ఆంజనేయులు ఎం ఎ బి ఎల్ పట్టాలు పుచ్చుకున్నా, సహజంగా రచయిత కావడం వల్ల వకాలత్ వదలి, పత్రికా రచయితగా జీవితం ప్రారంభించి, థాట్, స్వేస్ట్ త్రివేణి, క్వార్టర్లీ, ఇండియన్ లిటరేచర్ ఇండియన్ రైటింగ్ టుడే, హిందూ, స్వరాజ్య మొదలైన పత్రికలకు తెలుగు సాహిత్యాన్నిగురించి, ఇతర విషయాలను గురించి మేధావులకు ఆలోచనలు రేకెత్తించే వ్యాసాలు వ్రాశారు వ్రాస్తున్నారు ఇటీవలే కేంద్ర సాహిత్య అకాడెమీ ఆధ్వర్యాన డాక్టర్ సి ఆర్ రెడ్డిని గురించి ఒక గ్రంథం "విన్ డ్ టు ది వెస్ట్" అనె యాత్రా చరిత్ర, "వీరేశలింగం" లనె గ్రంథాలు ప్రచురించారు ప్రస్తుతం ఇండియన్ కవున్సిల్ ఫర్ కల్చరల్ రిలేషన్స్ పక్షాన ఆధునిక తెలుగు కవితా సంకలనం సిద్ధ పరుస్తున్నారు ప్రసన్న గంభీరమైన రూపు, చిరునవ్వుతో పలకరించే మర్యాద, ఎదుటి వానిలోని మంచినే గ్రహించే అలవాటు, తెలుగు తీయదనాన్ని, ప్రతిభను ఆంగ్లం ద్వారా ప్రపంచానికి తెలుపుదామనే తహతహ, ఆధునికులకు కదళీపాకంగా తెలిపే ఆంగ్ల రచనాచాతుర్యం, ముక్తసరిగా విషయైక దృష్టితో ప్రసం

(50 వ పేజీ చూడండి)

---

చచ్చిపోయాక మాష్టారుగారు మరీ మతిమాలిన వారిలా అయిపోయారు బాబూ! ఎరిగున్నవాళ్ళు పలకరిస్తే 'ఓహో! అలాగా!' అంటారంతే మతి వుందా అంటే వుంది, లేదా అంటే లేదు ... వెళ్ళండి బాబూ! వెళ్ళిపోతున్నారు పలకరించండి"

తను నిల్చున్నచోటంగా భూమి క్రుంగిపోతున్నట్లయింది.

## గృహ విక్రయం

"అన్నట్లు మరచేపోయాను మీ యింట్లోనేకదా బాబూ! వారు, అమ్మాయిగారు ఉంటూంట మీరయినా ఆ పుణ్యం కట్టుకోబట్టి, లేకపోతే, పాపం, నిలవటానికి కూడ నీడ లేకపోయేది!! ... వంతెన ఎక్కుతున్నారు, వెళ్ళి కలవండి"

అమ్మద్దు అనటమేగాని, అమ్మ ఈ విషయం ఎందుకు దాచింది? తను కన్న సుందర స్వప్నం అంతా క్షణాల్లో కరిగిపోయింది ఈ గృహ విక్రయం పేరుతో వాళ్ళ జీవితాల్లోకి తను యిప్పుడు వెళ్ళడం కన్నా ఆగిపోవడమే అన్నివిధాల మంచిదనిపించి అక్కడున్న బల్లమీదే చతికిలబడి పోయాడు శ్రీహరి!!!

— సీరియల్ —

# లాలస

కాకాని కమల

[గతసంచిక తరువాయి]

"నా తండ్రీ! ఇన్నాళ్లకి నువు నా మాట విన్నావురా నేను చచ్చేలోగా ఒక్కసారైనా నా మాట వింటావో వినవో అనుకున్నాను" అంది తల్లి సంబరంగా తలంటుతూ మధ్యలో "సాయంత్రం పెంద్రాళే వచ్చేస్తావుగా! ఎందుకో తెలుసా!" అంగి తెలుసన్నట్లు నవ్వుతూ తలూపాడు శ్రీనివాస్.

"బుద్ధా మిల్‌గయా" అంటూ సన్నగా పిల్లికూత కూసింది గీత

తరువాత కోడలుకి కూడా తలంటిపోసింది రాజ్యలక్ష్మమ్మ పిండివంటలతో భోజనాలు ఏర్పాటు చేసింది. శ్రీనివాస్ బయటికి వెడుతుంటే చీకటి పడకుండా వచ్చెయ్యమని మరీ మరీ చెప్పింది అన్న ప్రకారం అతను చీకటి పడుతూ వుండగానే వచ్చేశాడు

రాత్రి రోజూకంటే ఓ గంట ముందే అంతా భోజనాలు చేశారు విశాఖ పట్నంలో మేన మామ ఇంట్లోవుండి చదువుకుంటున్న గోపాల్ కూడా ఆ రోజే వచ్చాడు. అతనికి ఏవో హాలిడేస్ వచ్చాయట. అతనుచాలా సరదా గల మనిషి. అతను ఎక్కడ వుంటే అక్కడే సందడి వుంటుంది పైగా మంచి ఆర్టిస్ట్. "జి పాల్" అనే పేరు మీద అతని చిత్రాలు పత్రికల్లో వస్తూ వుంటాయి.




అనూరాధకి అత్తగారు దగ్గరుండి ముస్తాబు చేసింది. ఆడబడుచు బజారునుంచి తెచ్చిన సంపెంగ పూలు పెద్దదండ గుత్తుగా కట్టి అనూరాధ జడలో పెట్టింది. తెల్లచీర తెల్ల జాకట్టు వేసుకుంది బీరువాలోంచి సెంటు సీసా తెచ్చి వళ్లంతా పులిమింది రాజ్యలక్ష్మమ్మ ఒక్కసారి వాతావరణం అంతా 'కునేగా' పరిమళంతో నిండిపోయింది.

శ్రీనివాస్ గదిలో మంచం మీద పరుపు, తెల్లటి దుప్పటి పరిచారు. రెండు దిళ్లు వేసారు. "స్వీట్ డ్రీమ్స్" అని ప్రత్యేకం ఫాబ్రిక్ పెయింట్ చేసిన గలీబు తెచ్చి తొడిగింది గీత. ఒక స్టీలు కప్పునిండా బియ్యం పోసి అగరవత్తులు గుచ్చి వెలిగించి టేబుల్ మీద పెట్టి వచ్చింది ఫ్లాస్కు నిండా పాలు పోసి మంచం ప్రక్క గూట్లో పెట్టారు ఇంక అనూరాధ వెళ్లటమే తరువాయి

అనూరాధకి ఉదయం నుంచి మనసు మనసులో లేదు గుండె అంతా ఏదో గుబులుగ వుంది. ఎదురు చూసిన రోజు తీరా ఆసన్నమయ్యే సరికి లేనిపోని శంకలు ఆమె మనసుని చుట్టి ముట్టి భయకంపితురాలను చేస్తున్నాయి పెళ్లి అయి మూడేళ్లపైగా అవుతున్నా భర్త అంటే సన్నిహితత్వం అసలే లేదు పైగా భయం అతని ముభావం ఇన్నాళ్ళూ ఆమెని కాల్చివేసింది "ఆయనకి నేనంటే ఇష్టంలేదు" అన్న ఒక బలమైన అభిప్రాయం ఆమె నరనరాన నాటుకుని పోయింది. అతను మొఖం చిట్లించుకుని తన కేసి చూట్టం, తనరాక చూసి టేబుల్ ముందు నుంచి లేచిపోవటమే అనూరాధ మనసులో ముల్లులా కదులుతున్నాయి అనూరాధ అభిమానం, ఆమె సున్నితమైన మనసు ఎక్కడో దెబ్బతిన్నాయి ఆలోచించినకొద్దీ అతను ఏదో తప్పుని సరిగా ఒప్పుకున్నట్లు అనిపించ సాగింది. అట్లా అనుకుంటే ఆమెకి అతని గది ముందుకు కూడా వెళ్లా లనిపించలేదు. తీరా తను గదిలోకి వెళ్లాక అతని ప్రవర్తన ఎలా వుంటుందో వూహకి కూడా అంతుబట్టలేదు ఈ రోజు జీవితంలో ఒక గొప్ప మలుపు. ఒక ప్రక్క ముళ్ల బాట.

ఉత్తమ చిత్రాలకోసం ఎదురు చూసే ఆ హృదయాలపై పూలజల్లు కురిపించే సమున్నత చిత్రం!



కె. విశ్వనాథ్ దర్శకత్వం లో విజయలక్ష్మీ మూవీస్






# అమ్మ మనసు

నిర్మాత: జి.వి.యస్. రాజు

మాటలు: డి.వి. నరసరాజు * సంగీతం కె.వి. మహదేవన్

స్టేట్ డిస్ట్రిబ్యూటర్స్: అనిల్ ప్రభాస్ ఎంటర్‌ప్రైజెస్: విడుదల నవయుగ * సీడెడ్: విజయలక్ష్మీ మూవీస్ Veekay

***జరిగినకథ : 9*** రామనాధంగారి భార్య సుభద్రమ్మ. వారికి అనూరాధ, లక్ష్మి, సుందరి, శోభ అనే నల్గురమ్మాయిలు, రమణ అనే అబ్బాయి ఉన్నారు అనూరాధకు పెళ్లి సంబంధాలు చూస్తూంటారు రామనాధంగారు. అనూరాధని చూసుకుని వెళతారు పెళ్ళివారు ఎమ్ బి బి ఎస్ చదువుతున్న శ్రీనివాస్‌తో అనూరాధ వివాహం జరుగుతుంది. యౌవ్వనోద్రేకంలో తప్పటడుగు వేస్తారు సుందరి కృష్ణలు. భర్త శ్రీనివాస్‌కు తనంటే ఇష్టంలేదని ఎవరినన్నా ప్రేమించి ఉంటాడని అనుకుంటుంది అనూరాధ. పండక్కి రానందువల్ల కూతురు, అల్లుడికిగాను వియ్యంకుడి పేరున డబ్బు పంపిస్తారు రామనాధంగారు అనూరాధపట్ల తన ప్రవర్తనకు పశ్చాత్తాపపడతాడు శ్రీనివాస్ గర్భవతి అయిన సుందరికి ఆమెకు అన్యాయం చేయనని ధైర్యం చెపుతాడు కృష్ణ. కృష్ణ సుందరిల వివాహానికి కృష్ణ తండ్రి అంగీకరించటంతో శాంత పెళ్లికి కూడా లగ్నాలు పెట్టిస్తారు రామనాధంగారు. రమేష్ మాటలతో మారిన శ్రీనివాస్‌ని చూచి తల్లి రాజ్యలక్ష్మమ్మ ఆనందిస్తుంది.

మరోప్రక్క పూలతోట కనుపిస్తున్నది. కొంచెం మనసు నిబ్బరం చేసుకుంటే తన బ్రతుకులో ఏది ప్రాప్తం వుందో తెలిసిపోతుంది అనుకుంది. పైగా తనకి తానుగ గదిలోకి వెళ్లాలంటే అనూరాధకి బెదురుగా వుంది. ఇప్పటికే అత్తగారు రెండుసార్లు చెప్పింది ఇంక తప్పేటట్లు లేదు..

"వాడిసంగతి ఇన్నాళ్లనుంచి నువు చూస్తూ వున్నదే! కాస్త మొండి పట్టుదల గలవాడు. నా ముఖంచూసి నువ్వే సర్దుకుపో తల్లి. వాడ్ని దార్లోకి తెచ్చుకుని నీవాడ్ని చేసుకునే బాధ్యత నీదే!" అంది అత్తగారు. ఆవిడ అలా ఎందుకందో అనూరాధకి పూర్తిగ అంతుపట లేదు. ఎలాగయిన చూసి చూసి ఒక సాలెగూట్లో చిక్కుకున్నట్లు ఆమెకి అనిపించింది.

గదిలో శ్రీనివాస్‌కి చదవాలని లేదు. పుస్తకం అయితే ముందు పెట్టుకున్నాడుగాని అతని కంటికేమీ కనుపించటంలేదు. అనూరాధ రాకకోసం ఎదురుచూస్తున్నాడు తల్లి గదిలోకి వెళ్లి పడుకోమనటం, కాని అనూరాధ రాకపోవటం అన్నీ గమనిస్తూనే వున్నాడు "భయపడుతున్నట్లుంది రానీ భయం అంతా ఒదిలించేస్తాను" అనుకుని తనలో తాను నవ్వుకున్నాడు హాయిగా తలంటుకుని, కడుపునిండా తిన్నాడేమో, బాగా నిద్ర వస్తోంది చెల్లెలు పడుకున్నట్లుంది. తండ్రీ తమ్ముడూ సినిమాకి వెళ్లారు కాస్త అనూరాధ సిగ్గుపడకుండా, తమకి ఏకాంతంగా వుంటుందనే వాళ్లు సినిమాకి వెళ్లివుంటారని గ్రహించాడు శ్రీనివాస్. అతనికి నిమిష నిమిషానికి ఆరాటం ఎక్కువ అవుతోంది. అనూరాధ ఆలస్యానికి చిరుకోపం కూడా వస్తోంది. ఈ మూడేళ్లు ఎలా వున్నానా అని ఆశ్చర్యపొయ్యాడు తనలో తనే! అదే చిత్రం!

"అమ్మా..." అంటూ కేకపెట్టాడు.

"ఆఁ.." అంటూ హాల్లోంచే పలికింది తల్లి "నాకు నిద్ర వస్తోందే! తల అంతా దిమ్ముగాకూడా వుంది. కాస్త అమృతాంజనం పంపించు" అంటూ ఆవులించి దిండు మీద ప్రక్కకి ఒరిగి పడుకున్నాడు. యధావిధిగా చేతిలో పుస్తకాన్ని అలంకరించు కున్నాడు.

కొడుకు ఎత్తు తెలుసుకుని రాజ్యలక్ష్మమ్మ నవ్వుకుంది. ఈ కాలపు పిల్లల చిత్త ప్రవృత్తులు బహు విచిత్రం! అనుకుంటూ అల్మారాలోంచి అమృతాంజనం డబ్బా తీసి "అమ్మాయి! అనూరాధా.." అంటూ పిలిచింది. అనూరాధ అక్కడే వుంది! "ఇదిగో... ఇది వాడికిచ్చిరా" అని చేతికి సీసా అందిస్తూ... "ఇదిగో ఇప్పటికే తొమ్మిది దాటింది. ఇంక పడుకోండి నాకు నిద్దర వస్తోంది. వాళ్లు సినిమానుంచి వచ్చేసరికి ఏ రెండు అవుతుందో" అంటూ లైటార్పి చరచరా గదిలోకి వెళ్లి తలుపేసుకుంది.

ఇంక అనూరాధకి తప్పలేదు ఇంకా జాగు చెయ్యటం మూర్ఖత్వం అనిపించుకుంటుందేమో! అనుకుంది. మెల్లిగా గదిలోకి వెళ్లి అమృతాంజనం సీసా బల్లమీద పెట్టింది ఆమెకి మొదటిసారిగ భర్త గదిలోకి, అందునా రాత్రిపూట వెడుతుంటే చెప్పరాని సిగ్గూ, భయం ఒకదాని వెంట ఒకటి తరుముకుని వచ్చాయి. అదిరే గుండెలతో లోనికి అడుగుపెట్టింది. అతను తల వంచుకుని చదువుకుంటున్నాడు. అలికిడి తల ఎత్తలేదు. కాని పచ్చటి పాదాలపై జీరాడే తెల్లటి జరీ అంచునే గమనిస్తున్నాడు. అమృతాంజనం బల్లమీద పెడుతున్న గాజుల చేతిని చటుక్కున పట్టుకున్నాడు! భార్య కళ్లల్లోకి సూటిగా చూసి చిరునవ్వు నవ్వాడు. అనుకోని అతని చర్యకి అనూరాధ తెల్లబోయింది. "ఇందాకట్నుంచి అమ్మ చెప్తుంటే ఇప్పుడా రావటం?" అంటూ లేచి గది తలుపు గడియవేసి వచ్చాడు

అనూరాధ ఏమీ మాట్లాడలేదు. మౌనంగా వుండిపోయింది శ్రీనివాస్ టేబుల్ లైటు ఆఫ్‌చేసి తన బలిష్టమయిన చేతుల మధ్య ఆమెని బంధించాడు వారి ప్రణయ జీవితానికి అదే మొదటి కౌగిలి! పాన్పుదగ్గరకి మెల్లిగా నడిపించుకుని వెళ్లాడు.

అనూరాధకి ఇదంతా కొత్తగా వుంది. భర్త తన్ని ఇంత అనురాగంతో చూస్తాడని కల్లో కూడా అనుకోలేదు... "ఛ..కన్నీళ్లెందుకు? నీవంటే ఇష్టం లేదనుకున్నావా? అదేంకాదు నా చదువు దృష్టిలో పెట్టుకునే నీకు దూరంగా వున్నాను. నీ కేం? బంగారు బొమ్మవి! ఈ చీరలో. ఈ అలంకరణలో నువ్వు ఎంత బాగున్నావో తెలుసా!" అన్నాడు. అంతా నిన్ను-అనూ-అని పిలుస్తారు కదూ! కాని నేను మాత్రం రాధా! అని పిలుస్తాను. ఇష్టమేనా? ఈ రోజు ఎంతబాగుంది? ఓ పది రాత్రులు ఇట్లాగే కంటిన్యూగ వుండిపోతే బాగుణ్ను అనిపిస్తోంది అన్నాడుతమకంగా.

"నీ మనసుకి బాధ కలిగితే నన్నుక్షమించు రాధా" అంటూ చెక్కిలి మీద చుంబించాడు

'మనకి పెళ్లి అయి మూడేళ్లయింది కాని నాకు ఈ రోజే అయినట్లుంది ఇంతవరకు ఎన్నో రాత్రులు గడిచాయి కాని ఇదే అసలైన రాత్రి! అంతేనా' అన్నాడు నవ్వుతూ ఇవాళ మొదటి రోజు గనక ఊరుకున్నాను గాని ఇలాగే రోజూ మూగనోము పడితే ఊరుకోను తెలుసా! ఇంకా ఇలాగే సగం రాత్రి వరకూ మాట్లాడుతూనే వున్నాడు. చాలా సంగతులు చెప్పాడు. చిన్న చిన్న మాటలు తప్పించి ఎక్కువగ మాట్లాడలేకపోయింది అనూరాధ. ఆనందమో దుఃఖమో తెలియని ఉప్పెన పొంగి ఆమెకితెలియకుండానే కన్నీరు కార్చింది. భార్య పరిస్థితిని శ్రీనివాస్ గ్రహించుకున్నాడు.















## లాలస

"వద్దు వద్దు ఇప్పుడేమయిందని?" అంటూ లాలించాడు అతని లాలసకి ఇంకా కరిగి పోయింది అనూరాధ

ఆమె ఇన్నాళ్ళూ కలలు కన్న ఆ రోజు ఈనాడు అనుబవానికి వచ్చింది ఆ రాత్రి తియ్యతియ్యని అనుభవాలలో తెల్లవారింది ఇరువురి జీవితాల్లోనూ నూతన తేజస్సు తొంగి చూసింది రాగ హృదయంతో వారికి ఆ వేకువ స్వాగతం పలికింది ప్రకృతి శుభాసీస్సులందించింది చీకట్లు విడుతూ వుండగా అనూరాధ తలుపు తెరుచుకుని బయటికి వచ్చింది ఆ నాటి సూర్యోదయం ఆమెకి చాలా అందంగా కనుపించింది

* * *

అనూరాధకి ఇప్పుడు భర్త దగ్గర భయం పోయింది కొత్తలో రాత్రిపూట భర్త గదిలో పడుకుని, తెల్లారి అందరి మధ్యా మెసలాలంటే తగని సిగ్గుగా వుండేది కాని రానురాను అలవాటయిపోయింది ఇప్పుడు శ్రీనివాస్ ప్రతీదానికి " రాధా " అంటూ పిలుస్తాడు భర్త పన్లు అన్నీ దగ్గరుండి ఇప్పుడు అనూరాధే చెయ్యాలి కోటు తొడిగి గుండీలు సైతం పెట్టాలి టేబుల్ మీదే వున్నా స్టెత్‌స్కోపు సైతం తీసుకోడు అనూరాధే స్వయంగా అతని మెళో వెయ్యాలి అంత గారాలు పోతూ సాగించు కుంటున్నాడు ఒకసారి స్నేహితుడు రమేష్‌ని తీసుకొచ్చి భార్యకి పరిచయం చేశాడు కాఫీ టిఫిన్ పెట్టించాడు ఇప్పటికి నాలుగయిదు సార్లు భార్యని సినిమాకికూడా తీసుకెళ్ళాడు ఇంటిల్లిపాదీ ఒక ఆదివారం జగదీష్ ఇంట్లో గడిపి వచ్చారు

మెడికల్ కాలేజి గురించి భర్త చెప్పే విషయాలు విని నివ్వెరపోయేది అనూరాధ

"ఇంకెంత? ఈ హవుస్ సర్జన్ లయి పోయిందంటే ఎక్కడో అక్కడ జాబ్ దొరుకు తుంది అప్పుడు ఏకాఏకీ కాపురం పెట్టెయ్యటమే" అని వూరించేవాడు అనూరాధ అందం కళ్ళతోనే తాగుతాన్నట్లు ప్రవర్తి స్తాడు బహుకొంటె! ఇన్నాళ్ళు ఆ చిలిపి తనం ఎక్కడ దాచారో! అనుకునేది ఒక్కొక్క చీరలో ఒక్కొక్క భంగిమలో అనూరాధ అతడ్ని పిచ్చివాడ్ని చేస్తోంది

ఇంతముందు అతని కళ్లకివున్న గంతలు వూడి పొయ్యాయి.

"ఎవ్విరి గూస్ ఈజె శ్వాన్ అండ్ ఎవ్విరిగరల్ ఈజెక్వీన్" అంటాడు చార్లెస్ కింస్లే! ఎంతటి కళాత్మకమైన హృదయం లేకపోతే అల్లా చెపుతాడు?

"ఈసారి పెళ్లికి మీరు రాకపోతే నేనూ వెళ్లను" అంది అనూరాధ

"నేను రానని ఎప్పుడన్నాను అసలు? నువ్వు అడిగిందేది? మీ శాంత పెళ్లికి నువ్వు పిలిస్తే రాకపొయ్యానా! నువ్వు నాతో మాట మాత్రంగా అయినా రమ్మని పిలవ లేదు అందుకే పండక్కి పెళ్లికి రానన్నాను. ఎంత పరీక్షలయినా నువ్వుగా పిలిస్తేతప్పక వచ్చి వుండేవాడిని!" అన్నాడు. భర్తకేసి వింతగా చూస్తూ వుండిపోయింది అనూరాధ. ఎలాగైనా ఆయన తెలివిగలవారు తప్పు తన మీద వుంచుకోరు, అనుకుంది. భార్యాభర్త లిద్దరూ పెళ్లి నాలుగు రోజులుందనగానే వెళ్లారు.

అనూరాధ, శ్రీనివాస్ పెళ్లికి వచ్చేసరికి రామనాథంగారి కుటుంబ సభ్యుల ఆనందం వర్ణనాతీతం! రమణ అయితే ఒక్కక్షణం బావగార్ని వదల్లేదు బావగారు వచ్చిన మర్నాడే ఆఫీసుకి సెలవుచీటీ పంపించాడు అతను ఈమధ్యనే ఒక బ్యాంకులో క్లర్కుగా కుదిరాడు సుందరికి కడుపు బాగా కనిపించటం లేదుగాని, నలుగుర్లోనూ తిరగటానికి సిగ్గు పడుతోంది

అల్లుడు రాకరాక వచ్చాడని మంచి సూటు ప్రజంటు చేశారు. కూతురికి వుల్‌వాయిల్ చీర కొన్నారు పైగా ఇప్పుడు అనూరాధకి నెలమీద పదిహేను రోజులయింది! ఆమె శరీరం పసుపు తేలి మెరుస్తోంది. ఆ మెరుపు మనసులోంచి వచ్చింది ఆ రోజు రాత్రి అంతా కలసి కబుర్లు చెప్పుకుంటూ భోంచేశారు. చాలా సందడిగా గడిచింది.

ఇంకొక సంతోషకరమయిన వార్త ఏమిటంటే శాంత సంసారం కుదుటపడింది. "అసలేం జరిగింది? ఇప్పుడు శాంత ఎక్కడుంది?" అని అడిగింది అనూరాధ. అందుకు తల్లి చెప్పిన విషయం ఇది.

* * *

ఒకరోజు సాయంత్రం నాలుగు గంటల ప్రాంతంలో శాంత ఇంటికి శ్రీహరి చెల్లెలు సుగుణ వచ్చింది మాటలు అయ్యాక "శాంతా! కాస్సేపు పార్కుకి రా! నీతో కొంచెం మాట్లాడాలి" అంది. ఇప్పుడు శాంత అసలు బయటికి ఎక్కడికీ వెళ్లటంలేదు. వాళ్లకిగా వాళ్లు ఎవరికి చెప్పలేదు గాని ఎలా తెలిసిందో అందరికి తెలిసిపోయింది, శాంతని భర్త అనుమానించి పుట్టింటికి పంపేసినట్లు! అసలు శాంత పుట్టింటికి వచ్చిన నెలదాక అసలు సంగతి చెప్పలేదు. కాని అల్లుడి దగ్గర్నుంచి వుత్తరాలు రాకపోవటం, కూతురు దిగులుగ వుండటం గ్రహించుకుని తల్లి నిగ్గదీసి అడిగితే అసలు విషయం బయట పడింది కాపురంపెట్టి రెండు నెల్లు అయ్యింది అప్పుడే మళ్లీ పుట్టింటికి రావట మేమిటి? అన్న విషయం ఆరాకి వచ్చింది. అప్పట్నుంచి ఆ విషయం నలుగుతూనే వుంది.

"వద్దమ్మా! మా రోజులు బాగాలేవు అది ఇప్పుడు ఎక్కడికి రాదు" అంది సీతమ్మ సుగుణలాగే శ్రీహరి కూడా తన్ని పార్కుకి రమ్మన్న సంఘటన జ్ఞాపకానికి వచ్చింది శాంతకి

"అది కాదండీ! నేను కూడా కొంచెం దీనికి సంబంధించిన విషయం మాట్లాడాలనే పిలుస్తుంటే" అంది బెదురుగా

సీతమ్మ, శాంత ఆశ్చర్యంగా చూశారు. "అదేమిటో ఇక్కడే చెప్పుతల్లీ! ఇక్కడ పరాయివాళ్లెవరున్నారు" అంది సీతమ్మ. సుగుణకి చెప్పక తప్పలేదు. "సుగుణ అన్న శ్రీహరి శాంత భర్తకి ఆకాశరామన్న వుత్తరం వ్రాసాడుట! శాంత మంచి పిల్ల కాదని ఏదేదో వ్రాశాడట! రాయటమయితే రాశాడు గాని తరువాత చాలా చింతించాడు. పైగా ఇప్పుడు శాంత సంసారం పాడయిందని తెలిసి అతను పశ్చాత్తాపంతో కృంగి పోతున్నాడు. "వాడిది పుట్టి దుడుకు స్వభావం అండి! నిజానికి వాడు చాలా మంచివాడు. కాని చెడు స్నేహాలు చేసి పాడయి పొయ్యాడు. వాడ్ని రెచ్చకొట్టకుండా దార్లోకి తేవాలి. వాడికి శాంత అంటే మొదట్నుంచి ఒక విధ మయిన ఇష్టం. కాని శాంత వాడ్ని నిర్లక్ష్యం చేసి, వాడి అభిమానం మీద దెబ్బ తీసింది. దాంతో పగ పెంచుకున్నాడు" అంది వాడి పిచ్చిచేష్టకి దుష్ఫలితం కలిగాక వాడిలోని




మానవత్వం మేల్కొంది. ఇప్పుడు తనకిగ తాను చాలా బాధపడుతున్నాడు" అంది. శ్రీహరిచేసిన వెధవ పనికి తల్లి తండ్రులు కూడా బాగా తిట్టారు. శ్రీహరిలోని మంచి సుగుణం ఏమిటంటే మోహనరావు ముందు ఏ విధమయిన ఆవేశపడకుండా, అభిమానపడకుండా తన తప్పు ఒప్పుకుని క్షమాభిక్ష అడుగుతానని ఒప్పుకున్నాడు. మొత్తానికి చాలా గొడవ జరిగింది. మోహనరావు రెండు నెలల సెలవు అనంతరం ఆఫీసులో జాయిన్ అయ్యాడు. అతని తండ్రి, సత్యన్నారాయణ అంతా కలిసి అతన్ని ఒప్పించి అత్తారి వూరు తీసుకొచ్చారు. స్కూలు హెడ్ మాష్టరు గారు, శ్రీహరి, అతని తల్లి తండ్రి, ఇంకా నలుగురు పెద్ద మనుషులు చేరి పంచాయితీ జరిపారు.

## లాలస

ఉత్తరం బయటపెట్టి సంగతి తేల్చారు. శాంత అమాయకురాలని, కేవలం ఆవిడ నిర్లక్ష్య ప్రవర్తన వల్ల అంతటి అవాంతరం సంభవించిందని రుజావయింది. శ్రీహరి కూడా చిన్నవాడు. తెలిసి తెలియని జ్ఞానం. తప్పు చేసినా ఒప్పుకున్నాడు. నలుగుర్లో చేసినతప్పుకి శిక్ష అనుభవించి ఒక ఆడపిల్ల జీవితాన్ని కాపాడాడు పెద్దలంతా నీతులుచెప్పి పంపివేశారు. మోహన్రావు శాంతని నిండు మనసుతో స్వీకరించాడు. నాలుగు నెల్లపాటు కొన్ని హృదయాలు నలిగినా చివరికి కథ సుఖాంత మయ్యింది. అసలు మోహన్రావుకి శాంత అంటే చాలా ప్రేమ. ఈ పాటి విరహమే అతన్ని మార్చివేసింది. "శాంతది తప్పులేదేమో! నేను తొందర పడ్డానేమో! మళ్ళీ ఆమెని లెటర్ వ్రాసి పిలిపించు కుంటే" అని తర్జన భర్జన పడుతున్న సమయంలోనే మావగారు తండ్రి రావటం జరిగింది.

ప్రస్తుతం శాంత పుట్టింట్లోనే వుంది. అన్నగారి పెళ్లి అయిన వెంటనే వెళ్లిపోతుంది పెళ్లికి మోహన్రావ్ కూడా తప్పక వస్తానన్నాడుట" అంటూ తల్లి చెప్పిన కథనం విన్నాక అనూరాధ హృదయంలోని బరువు దిగిపోయి గొప్ప రిలీఫ్ కలిగింది. గొడవలనేవి అందరికీ వస్తూనే వుంటాయి. సమసిపోతే బాధ లేదు అనుకున్నారంతా

మొత్తానికి శ్రీనివాస్ కూడా ఆ నాలుగు రోజులు చాలా ఆనందంగ గడిపాడు. బావమరిది రమణ ఆర్భాటం, చాటు చాటుగ ముసిముసి నవ్వులు నవ్వుతూ మరదళ్ల ఆహ్వానం, అత్తగారి అగ్గగ్గల, మావగారి ఆదరణ, భార్య అనురాగం అతన్ని చాలా ఆనందపరిచి తృప్తిని కలిగించాయి. అల్లుణ్ణి చాలా చక్కగ మర్యాద చేశారు. పైగా అనూరాధతల్లికాబోతోందన్నవార్త వారందరిని ఇంకా సంతోషంలో ముంచివేసింది. లక్ష్మి బావగారితో ఏవో రెండు మాటలయినా మాట్లాడిందిగాని సుందరి అయితే కనీసం ఎదురు పడటానికి కూడా సిగ్గు పడింది. అసలు ఈ మధ్య సుందరి అలికిడి ఇంట్లోనే ఎక్కువగ వినిపించటంలేదు! ఆగిపోయిన

గడియారంలా స్తబ్ధుగ వుంటు న్నది పెళ్ళి అయి భర్త దగ్గరికి వెడితేగాని తిరిగి ఆమెలో చైతన్యం కలిగేలా లేదు అవును మరి! సుందరిలోని అందానికి, ఆనందానికి కారణం కృష్ణే కదా!

శ్రీనివాస్ వచ్చాడని తెలిసి కృష్ణ వచ్చాడు. అతని వ్యక్తిత్వం, మంచి తనం చూసి మెచ్చుకోకుండా వుండ లేక పొయ్యాడు శ్రీనివాస్. బాగా "అదృష్టవంతుడు" అనుకున్నాడు తనలో. ఆ రాత్రి ముగ్గురూ కలిసి సినిమాకి వెళ్ళారు.




"మీ బ్యాంకు జాబ్ ఎలా వుంది? శాలరీస్ బాగుంటాయి కదా!" అన్నాడు శ్రీనివాస్.

"ఆఁ... గవర్నమెంటు జాబ్సు కంటె నయమే లెండి. ఏడాదికి రెండుసార్లు బోనస్ దొరుకుతుంది" అన్నాడు. ఈ మధ్య నక్సలైట్లు ఒక డిస్ట్రిక్ట్ బ్యాంకుని ఎలా దోపిడీ చేసింది వివరించాడు కత్తిని ప్యూన్ అరచేతిలో దించేశారండీ! అయినా మొత్తానికి పోలీసులు పట్టేశారు లెండి!" అన్నాడు.

"కొత్తగా ఈ లోన్లు ఇవ్వటం ప్రవేశ పెట్టాక చాలా మందికి జీవనాధారం లభ్య మవుతోంది లెండి. ఇన్నాళ్ళకి మనదేశంలో ఒక మంచిపని జరిగింది." అన్నాడు

"ఎంప్లాయిస్‌కి బొత్తిగా స్వార్థం ఎక్కువై పోయిందండి! పగలు వర్కింగ్ టైమంతా అటు తిరిగి ఇటు తిరిగి వేస్టు చేస్తారు. పనంతా పెండింగ్ పెడతారు. సాయంత్రం ఆరుగంటలు అయ్యేసరికి ఓవర్ టైమ్ కూర్చుంటారు. మా బ్రాంచిలో అయితే శాలరీస్ కంటే ఓ. టి. ఎక్కువై పోతోందనుకోండి!" అన్నాడు. ఇలాంటివే ఎన్నో చాలా హుషారుగా కబుర్లు చెప్పాడు. ఇన్నాళ్ళనుంచి డాక్టరు బావగారితో ఎన్ని మాట్లాడాలనుకున్నాడో అన్నీ మాట్లాడాడు. ఆ మర్నాడు బ్యాంకుకి తీసుకెళ్ళి ఫ్రెండ్సుని పరిచయం చేశాడు. శ్రీనివాస్ రమణని, కృష్ణని హైదరాబాద్ రమ్మని ఆహ్వానించాడు.

వున్నంతలో చాలా వైభవంగా, ఆనందంగా వివాహ మహోత్సవాలు జరిగాయి. రామం లక్ష్మిల జంటకంటే, కృష్ణ సుంధరిల జంట చూడ ముచ్చటగ ఉంది. పెళ్ళికి అనూరాధ, అత్తగారు, మామగారు కూడా వచ్చారు. పెళ్ళి అయిన మూడో రోజు భర్తతోటే ప్రయాణం అయ్యింది.

కాళ్ళకి పసుపు పూయించుకుని, కుంకుమ పెట్టించుకుంది అనూరాధ. కొత్త చీర కట్టుకుని భరతో రిక్షా ఎక్కింది. ఇప్పుడు ఆమె మనసులోనే కాక అందరి హృదయాల నిండా ఆనందం చిందులు వేస్తున్నది రిక్షా కదలగానే శ్రీనివాస్ లాలసతో అనూరాధ నడుంచుట్టూ చెయ్యివేశాడు. 'వెనకాల సైకిల్ పై రమణ వున్నాడు' అని సైగ చేసింది. ఫరవాలేదులే... అన్నట్లు కళ్ళతోనే సైగచేశాడు ఇద్దరూ హాయిగా నవ్వుకున్నారు. అవును. భర్త ప్రేమే స్త్రీకి అందం. అతని లాలసే ఆమెకి అభరణం!

(అయిపోయింది)

## ఇద్దరమ్మాయిల కథ

(18వ పేజీ తరువాయి)

కూతుర్ని దణ్ణం పెట్టుకోమంది మాధవి బుద్ధిగా వచ్చి దణ్ణం పెట్టి, నొసటన కుంకుమ దిద్దుకుంది.

"ప్రశ్నలన్నీ-ఒకమారుకు రెండు మార్లు జాగ్రత్తగా చదివి జవాబులు వ్రాయమ్మా" పెన్నులో ఇంక్‌పోస్తూ అంది సుగుణమ్మ.

"అలాగే"

"అవునూ. పరీక్షయిపోయాక ఇంటి కెలా వస్తావ్...?"

"అనిత నన్ను ఇంట్లో దింపుతానంది." తన కెదురేగి వస్తున్న అమ్మకు టాటా చెపూ్త, సాగిపోయింది మాధవి పోతున్న కూతుర్నే చూస్తూ నిల్చుంది సుగుణ.

"నీ కూతురేదో ఎం. ఏ.కు అప్పియర్ ఐనట్లుందే నీ వాలకం చూస్తే" ఆఫీసుకని బయలుదేర బోతున్న రామారావ్ హాస్య మాడాడు.

'చిన్న సన్నాసి! దానిపాలిటికిదే ఐ.ఏ.ఎస్ నా కూతురుకేమండి—చదువుల సరస్వతి జిల్లాకి ఫస్టు రాంక్ కొట్టేసి..."

"క్యాష్ ప్రయిజ్ కూడా కొట్టేస్తుందట టావ్-అంతే కదూ నీ శ్రమ, దాని శ్రద్ధ వూరకేపోతాయా! మాధవి చదువుతో నువ్వు మయినట్లున్నావ్ .." భార్యకేసి ఆప్యాయంగా చూస్తూ బయటకు నడిచాడు రామారావ్. పిల్లల అభివృద్ధికి పెద్దలే మరి దోహదం చేయాల్సింది.

మాధవి వచ్చీ రావడంతోటే పుస్తకాలు. ప్యాడ్ టేబిల్ మీద గిరాటువేసి, "అమ్మా! ఇవాళేం జరిగిందో తెలుసా?" అంటూ, బట్టలుతుకుతున్న సుగుణదగ్గరికి వచ్చింది.

పిండుతున్న బట్టల్ని బక్కెట్టులోవదిలేసి, "ఎలా రాసావమ్మా పరీక్ష? ప్రశ్నలు తేలిగ్గా వచ్చాయా? ఏదీ...కొశ్చన్ పేపరు?" హడావిడిగా ప్రశ్నించింది.

పేపరందిస్తూ, "చాలా ఈజీగానే వుందమ్మా.కానమ్మా పిల్లలందరూ తెగ కాపీ కొట్టేసారు" కష్టంగా అంది మాధవి

"అదేంటి వాచర్లుంటారు కదా .!"



**6-12-74 సంచికలో**

# అహం - అనురాగం

*పరిమళా సోమేశ్వర్*

**కొత్త సీరియల్ ప్రారంభం!**




"ఓ... ఎందుకు లేరూ... బోలెడు మంది"

"మరి కాపీచేస్తుంటే వాళ్ళేలా వూర్కు న్నారు మాధవీ?"

"అయ్యో రామ! వాళ్ళే ఆన్సర్స్ చెబు తున్నారమ్మా ఒకరిద్దరు మాస్టర్లు మాత్రం కాస్త స్ట్రిక్‌గా వున్నారు. ఐదవ తరగతిలో మాకు తెలుగు చెప్పేవారే – ఆవిడేనమ్మా – మాణిక్యం టీచర్ – 'గాంధీజీ బాల్యం' అన్న పాఠంలో గాంధీగారు కాపీ కొట్టనన్నారన్న విషయాన్ని వివరిస్తూ అప్పుడు అర్ధగంట మాట్లాడారు. మరి ఆ టీచరే, ఇప్పుడు కాపీ అలా చేస్తున్నారు – తప్పు కాదా అమ్మా...?!"

ఉలిక్కిపడింది సుగుణ. ఎంత ఘోరం. పిల్లలకు మంచి బుద్ధులు, న్యాయమార్గం నేర్పవలసిన గురువులే, వక్రమార్గాన నడిచి మార్గదర్శకులవుతూంటే ఇక పసిపిల్లల గతేం కాను! అయినా, టీచర్లనే పూర్తిగా తప్పు పట్టలేం. మరి తప్పెవరిది? ఎక్కడుందీ లోపం!

"మధూ! చూడమ్మా, ఒకరితో నీకు పనిలేదు. ప్రశ్నలన్నింటికీ నీకు సమాధానాలు వచ్చుకదా. పాఠం రానివాళ్లకికాని కాపీ కొట్ట

# వారఫలం

మహేష్

22-11-1974 శుక్రవారంమొదలు 28-11-1974 గురువారం వరకు

మేషం :— వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వారం మధ్యలో మీ తాలూకు వస్తువులు పోవచ్చును. వ్యాపారంలో ప్రయాస కలుగుతుంది. వారం ఆఖరుతో అన్ని వ్యవహారాలు తిరిగి బాగుంటాయి. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

వృషభం:— ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. నూతన వ్యవహారాలు బాగుంటాయి. వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. వారం ఆఖరులో లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. అధికవ్యయం జరుగుతుంది.

మిధునం .— వ్యాపారంలో అనుకూల వార్తలను వింటారు సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. స్త్రీలకు— నూతన విషయాలను తెల్సుకొంటారు. దైవ కార్యాలు నెరవేరతాయి.

కర్కాటకం:— మీ కార్యక్రమాల్లో వ్యతిరేకత ఏర్పడగలదు. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది వారం మధ్యలో వృత్తిలో ఆదాయం పెరుగుతుంది మిత్రుల సహాయం లభిస్తుంది. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో చికాకులు ఏర్పడతాయి బంధుమిత్రులను కల్సుకొంటారు.

సింహం :— మీ ప్రయత్నాలు ఫలిస్తాయి రావలసిన డబ్బు అందగలదు వారం మధ్యలో చికాకులు ఏర్పడతాయి. సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు. వారం ఆఖరులో అనుకూలమైన మార్పులు వస్తాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అనవసరమైన వ్యయం చేస్తారు

కన్య :— వృత్తిలో పోటీదారి పోటీ పెరుగుతుంది. ప్రయాణాలు వాయిదా పడతాయి. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగుంటాయి వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు వారం ఆఖరుతో మీ తాలూకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. ఎవరితోనూ వాద ప్రతివాదాలు తగవు

తుల.— మీ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరతాయి. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. ఇతరుల నిమిత్తం శ్రమకు గురి కాగలరు. అనవసరమైన సందేహాలు కలుగుతాయి. వారం ఆఖరులో రావలసిన డబ్బు సమయానికి అందుతుంది స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

వృశ్చికం :— మీ మంచితనమే మీకు ఇబ్బంది కలిగిస్తుంది. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. ప్రయాణాలు ఫలిస్తాయి విద్యా వైజ్ఞానిక

# ఇద్దరమ్మాయిల కథ

వలసిన దుస్థితి — నీకు కాదమ్మా. ఎవరో చెయ్యమన్నారని, ఎవరో చేస్తున్నారని, ఇంకెవరో చెయ్యబోతున్నారని, మనం ఎప్పుడూ మంచి పద్ధతులని మార్చుకోరాదమ్మా. కాపీ చేయడమన్నది ఎప్పటికీ తప్పే.''

''ఆఁ. నీకీ గొడవలన్నీ అనవసరం. పద, అన్నం తిని కాస్సేపు పడుకుందువుకాని. తర్వాత లేచి రేపటి పరీక్షకి చదువుకోవాలి.''

కూతుర్కి సమాధానం చెప్పగల్గింది కానీ సుగుణ మనస్సంతా ఏదో చెప్పజాలని కలవరంతో నిండిపోయింది. మైనపు ముద్దల్లాంటి ఈ లేత మనస్సులకి, న్యాయాన్యాయాల ఛాయలు సోకని ఈ పవిత్రమూర్తులకి ఇటువంటి దుస్సంఘటనలు ఎదురవ్వడం ఎంత దురదృష్టం! అదే మాట ఆఫీసు నుండి వచ్చిన భర్తతో అంది సుగుణ, ఆ సాయంత్రం.

''నిజమే సుగుణా! ఎంతో పవిత్రంగా వుండవలసిన దేవాలయాలు — విద్యాలయాలు ఇవిలా కల్మష పూరితం అవడం మనయొక్క మన పిల్లలయొక్క దురదృష్టమనే చెప్పాలి పిల్లలెంత శ్రద్ధగా చదివారన్నది విస్మరించి ఎంత బాగా మార్కులు సంపాదించుకో గలరన్నదే నేటి తల్లిదండ్రులు ఆలోచిస్తున్నారు. 'కంచే చేను మేసినట్లు' అన్యాయాన్ని ఖండించవలసిన టీచర్లే అన్యాయాలని ప్రోత్సహిస్తున్నారు. విజ్ఞానవంతులైన విద్యావేత్తలే ఇలా ప్రవర్తిస్తుంటే, ఇక ఎవరినో ఏమనాలి ... !'' బాధగా మాట్లాడుతున్న భర్తనే చూస్తూ ఉండి పోయింది సుగుణమ్మ.

ఇది ఏ ఒక్కరో బాధపడితే నివారణ అయ్యే సమస్య కాదు. ప్రతి ఒక్కరిలోనూ మంచి తనపు వ్రేళ్ళు మొలకెత్తి సర్వజనావళికి శుభము చేకూరే రోజులు రావాలి!

(ఇంకా ఉంది)

రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వారం ఆఖరులో రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి
స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది ఆడంబరం కోసం వ్యయం చేస్తారు

ధనుస్సు — వ్యాపార విస్తరణ ప్రయత్నాలు

## వారఫలం

బాగుంటాయి మిత్రులకు సహాయం చేస్తారు ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది వారం ఆఖరులో మీ కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి
స్త్రీలకు— వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు పుణ్య కార్యాలు చేస్తారు

మకరం — మీ శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది రావలసిన డబ్బు అందుతుంది మీ కృ

క్రమాలు చురుకుగా సాగుతాయి సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి వారం ఆఖరులో సామాన్యమైన పనులకు కూడా మీరు యెంతో కృషి చేయవలసి వస్తుంది స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది శుభ కార్యాల విషయంలో అభివృద్ధిని సాధిస్తారు

**కుంభం** — వృత్తిలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి సాటివారిలో గౌరవం బాగుంటుంది నూతన వ్యవహారాలు లాభిస్తాయి విద్యావైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి బంధుమిత్రులను కలుసుకొంటారు

**మీనం** — కొంతమంది వ్యక్తులు మిమ్మల్ని మోసం చేయడానికి ప్రయత్నిస్తారు అధికవ్యయం జరుగుతుంది వారం మధ్యలో ప్రయాణాలు ఫలిస్తాయి ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది ప్రయోజనం గల పరిచయాలు ఏర్పడతాయి స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు నూతనవిషయాలు తెలుసుకొంటారు

# హైదరాబాద్ నోట్‌బుక్

(35 వ పేజీ తరువాయి)

గించే పద్ధతి గల శ్రీ ఆంజనేయులు తమ పదవిని, అధికారాన్ని తెలుగు అభ్యున్నతికి వినియోగించు కొంటారని, కార్యభారం ఎంతవున్నా, సాహిత్య సేవలో వెనుకబడరని నానమ్మకం.

ఉపశ్రుతి:

"పిల్లలు, పిల్లలు అని వారిని ఇంతగా పైకి ఎక్కిస్తే ఇక మానవమాటలు విన్నట్టే ఈ అల్లరి వెధవలు" అన్నాడు బాలల ఉత్సవానికి వచ్చిన ఒకరు.

"బాగుందండోయ్ మీ వాదన. ఒక ఉరుదూకవి అన్నాడు—బచ్చేమ్మే శరారత్ విన్గారీహై, ఉసకో ఫడక్ నేనదో, భ-జ్ నేనదో—(పిల్లలలో అల్లరి నిప్పు రవ్వ. దానిని గప్పుమనజేయరాదు. ఆరిపోయేట్టు చేయరాదు.) అని. మనం వారిని పెంచడంలో వుంది." అని మనస్తత్త్వవేత్త ఒకరు సమాధాన మిచ్చారు. ●



**Printed and Published by S NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3 Editor S Radhakrishna**

# ఒక చొక్కా కొన్నప్పుడల్లా మూడు చొక్కాల విలువను పొందండి




ఇది మీలో ఆశ్చర్యాన్ని కలిగించే సంగతే 'టెరీన్'® బట్టలవలన ఎన్నో అద్భుతమైన లాభాలున్నాయి. 'టెరీన్' బట్టలతో తయారు చేయబడిన చొక్కాలు మామూలు చొక్కాల కన్న మూడింతలు మన్నిక గలవి వాటికి మీరు కొంచెం అదనంగా చెల్లించవలసి ఉంటుంది కాని మీరు చెల్లించేదానికి మూడింతలు విలువ లభిస్తుంది అందుకే, బట్టలపై, 'టెరీన్' ట్రేడ్‌మార్క్ చూడడం వలన మీకెంతో లాభిస్తుంది 'టెరీన్' బట్టలు చిరకాలపు మన్నికగలవేగాక, వాటిని వాడడం కూడా సులభం లాండ్రీ బిల్లులు ఎక్కువగా చెల్లించే పని ఉండదు 'టెరీన్' బట్టలతో కుట్టించిన చొక్కాను ఇంట్లో హాయిగా ఉతుక్కోవచ్చు అది ముడతలు పడిపోదుగనుక ప్రత్యేకమైన శ్రద్ధ వహించనక్కర లేకుండా ధరించవచ్చు

**బట్టలపై 'టెరిన్' ట్రేడ్‌మార్క్‌ను చూసినప్పుడు మీరు వాటి నాణ్యత గురించి ఆలోచించే పనే ఉండదు.**

**TERENE**